# తొలి పలుకు

ఇది పధ్నాలుగేళ్ల క్రితం మాట. అప్పటి కింకా మా కన్నారి ప్రేమ నాథుడు మా కళ్లముందే ఉన్నాడు. అప్పుడు మా కో అభిప్రాయం కలిగింది; ఏమని? మన పురాణాలూ యితిహాసాలూ అన్నీ ఆ చిరంజీవికి చిరుతవయస్సు లోనే బోధించాలీ అని. వాటి ప్రభావం అతని జీవితంమీద ప్రస్ఫుటంగా పడేటట్టు చూడాలీ అని.

అది అజ్ఞానులమైన మా నిర్ణయం. కాని, దైవనిర్ణయం వేరుగా ఉంది. అందుకనే, మా చిన్నారి మమ్మల్ని వదలి ఆ వెంటనే వచ్చినచోటికి వెళ్లి పోవటం జరిగింది.

ఆ తరువాత మాలో ఒక విధమైన మార్పు కలిగింది. అంతకు పూర్వం మా కళ్ల ముందు ఉండే మా ప్రేమనాథుడు మా కళ్లల్లోనే కాపురం ఉండి పోయినాడు. మా కళ్లకు కనబడే చిరంజీవు లందరిలోనూ మా ప్రేమనాథుడే ప్రతిబింబించసాగాడు. అది మా జీవితాలకు ఒక అద్భుతమైన అనుభూతి అయింది.

ఆ అనుభూతి కలగగానే, అంతకు ముందు మా చిన్నారికి చేద్దామను కున్న సేవ ఆ చిరంజీవు లందరికీ చేయటం భావ్యమనిపించింది. ఆ విధంగా అతని ఆత్మకు శాంతిని చేకూర్చటమూ మాకు మేము మనశ్శాంతిని పొంద టమూ మంచిదనిపించింది.

ఆ అభిప్రాయంతోనే, మేము, హైదరాబాదు సంస్థానంలో ప్రప్రథమంగా బాలోద్యమాన్ని ప్రారంభించి, 'బాలభారతీ కళాకేంద్రం' అనే ఒక సంస్థను స్థాపించాం. దాని పక్షాన ఒక బాలగ్రంథాలయాన్నీ, రెండు నృత్య కేంద్రాలనూ నెలకొల్పి నిర్వహించాం. దాని ఫలితంగా, కొంతకాలం పాటు, కొన్ని వందలమంది 'ప్రేమనాథు'లు మా కళ్లయెదుట కలకల లాడుతూ కనబడటం జరిగింది. ఆ సమయంలోనే మాకు చిరంజీవి కృష్ణ కుమారితో పరిచయ మయింది.

చిరంజీవి కృష్ణకుమారి శ్రీయుతులు బూర్గుల రామకృష్ణారావుగారి కుమార్తె. శ్రీ రామ కృష్ణారావు గారు స్వాతంత్ర్య సమరయోధులు, దేశసేవా ధురంధరులు, బహుభాషా విశారదులు, వాఙ్మయ పోషకులు, అన్నిటినీ మించి రసజ్ఞులు; సహృదయులు. వా రప్పుడు హైదరాబాదు సంస్థానానికి ముఖ్య మంత్రిగా ఉంటూ ఉండేవారు. మా అదృష్టవశాత్తు వారి చిరుపాప అయిన కృష్ణకుమారి మా పాపల సంఘంలో ప్రథమ సభ్యురా లయింది; మాకు పట్టుకొమ్మ అయింది.

అప్పటికి కృష్ణకుమారి వయసు ఆరేళ్లు. అప్పటికే ఆమె చక్కగా వ్రాయటమూ చదవటమూ నేర్చుకుంది. మితభాషిత్వమూ, నిర్భయత్వమూ సభారంజకత్వమూ అన్న గుణాలు ఆ చిరుత ప్రాయంలోనే ఆమె అధీనమైనై. ఆ రోజుల్లో మే మేపని చేసినా ఆమె పేరటనే చేసే వాళ్లం. ఆ సంస్థ ఆమెదే అన్నట్టుగా వ్యవహరించే వాళ్లం. ఆమెకూడా, ఆ గౌరవాన్ని అత్యుత్తమ స్థాయిలో నిలుపుకుంటూ వచ్చింది.

ఈ సందర్భంలో ఒకచిన్న విషయం స్ఫురణకు వస్తోంది. ...ఏ రంగంలో అయినా, ప్రముఖులైన వారికి బిరుదు లివ్వట మనేది లోకాచారం. ఆ బిరుదులు సామాన్యంగా వయసు మళ్లినవారికే లభిస్తూ ఉంటై; కానీ అవి యీ మధ్య మంచి వయసులో ఉన్న యువతీ యువకులకు కూడా లభిస్తున్నై; అలా సన్మానింప బడ్డవారే మన 'మిస్. మద్రాసు'లూ, 'మిస్టర్. యిండియా' లూను.

బాల బాలికలకు బిరుదు లివ్వట మన్నది భారతదేశానికి క్రొత్త. ఆ పనిని ప్రప్రథమంగా మా బాలభారతీ కళాకేంద్రం చేయ తలపెట్టింది. ఐదు సంవత్సరాల లోపున ఉన్న పిల్లల్లో అందచందాలూ, చురుకు దనమూ, తెలివితేటలూ, శుభ్రతా, ఆరోగ్యమూ అన్నవి పరీక్షించి అన్నింటిలోనూ అగ్రతాం బూలాన్ని అందుకున్న చిరంజీవికి 'ముద్దుల మూట' (Kiss me child) అన్న బిరుదునూ - స్వర్ణ పతకాన్నీ బహూకరించేటానికి నిర్ణ యించింది.

ఆసంవత్సరం జరిగిన పోటీలో సంస్థానం నలుమూలల నుంచీ వచ్చిన బాలబాలికలు, కొన్ని వందలమంది పాల్గొన్నారు. సంస్థాన ప్రముఖులు కొందరు నిర్ణాయక సంఘంలో సభ్యులుగా ఉండి అన్నిటా ఉత్తముడుగా ఒక

మూడేళ్ల కుఱ్ఱవాణ్ణి నిర్ణయించారు. ఆ పోటీని చూడటానికి జనం వేల సంఖ్యలో వచ్చారు. వాళ్లందరి సమక్షానా ఆ చిరంజీవికి బిరుదునూ, పత కాదులనూ బహూకరించింది, మన కృష్ణకుమారి. ఆ సందర్భంలో ఆమె ఒక చిన్న ఉపన్యాసం కూడా చేసింది. అది తలుచుకున్నప్పుడల్లా మా ఒళ్లు పుల కరిస్తూ ఉంటుంది. ఇంతకూ అదంతా యీనాడు ఒక మధురస్మృతి మాత్రమే.

ఈ పైన, 'మేము' అన్న పదప్రయోగం వ్యర్థంగా చేసింది కాదు. ఆత్మ గౌరవసూచకంగా వాడుకున్నది అంతకంటే కాదు. 'మేము' అని నే నన్నప్పుడు నా ప్రక్కనే, నా కష్టసుఖాల్లో భాగస్వామిని అయిన శ్రీమతి రుక్మిణీదేవి ఉన్నదన్న మాట. ఈ బాలోద్యమంలో నేను ప్రవేశించటానికీ, బాలబాలికలకు నేను సేవచేయటానికీ నిజంగా ఆమెయిచ్చిన దోహదం యింతా అంతా కాదు. బాలోద్యమ విషయంలోనే కాదు; భాగవత కథారచనలోకూడా ఆమె ప్రోత్సాహం నాకు అమితంగానే లభించింది. 'వెన్నముద్దలు బాగున్నై' అని యే చిన్నారి హృదయమైనా సంతోషిస్తే తొలుదొల్తగా సంతృప్తి పడవలసింది శ్రీమతి రుక్మిణీదేవి.

ప్రోత్సాహం అన్న మాట స్ఫురణకు వచ్చినప్పుడల్లా నాకు మా చిరంజీవి ముష్టి వెంకటశాస్త్రి గుర్తుకు వస్తాడు. కుచేలుడయిన యీ కృష్ణకవికి అతను శ్రీ కృష్ణుడు. అతని ఆదరాభిమానాలే లేకపోతే గడచిన పాతిక యేళ్లలోనూ వచ్చిన గండాలన్నీ గడచి, యీ వెన్నముద్దలు తయారు చేసే అదృష్టం యీ రచయితకు లభించేది కానేకాదు. అందుకనే అతణ్ణి గురించి యిక్కడ ప్రస్తావించవలసి వచ్చింది.

భాగవత రచన పూర్తికాగానే, నేనొకసారి, ప్రస్తుతం కేరళ రాష్ట్ర పాలకులు (గవర్నర్) గా ఉన్న శ్రీ బూర్గుల రామకృష్ణారావు గారిని సంద ర్శించటం జరిగింది. ఆ సందర్భంలో 'వెన్న ముద్దల' ప్రసక్తి వచ్చింది. 'వీటిని మన కృష్ణకుమారికి యివ్వాలని ఉంది', అన్నాను; నేను. వారు నా హృదయం తెలిసినవారు కాబట్టి, మరో ఆలోచనలేకుండా 'దానికేం .. అలాగే కానివ్వండి!' అన్నారు. అంతే. ఆ క్షణంలోనే నా 'వెన్నముద్దలు' ఆ చిరం జీవికి దత్తమైపోయినై.

చిరంజీవి కృష్ణకుమారి 1943 జూలై 16 వ తేదీన భాగ్యనగరంలో జన్మించింది. అక్కడ ప్రఖ్యాతి వహించిన స్టాన్లీ బాలికల ఉన్నత పాఠశాలలో యెనిమిదవ తరగతి వరకు చదివింది. ఇప్పుడు, తల్లిదండ్రులవద్ద తిరువనంతపురంలో ఉండి తొమ్మిదవ తరగతి చదువుకుంటోంది.

హైదరాబాదులో ఉన్నప్పుడే యీ చిరంజీవి సంగీతమూ నృత్యమూ నేర్చుకున్నది. ఇప్పుడు తిరువనంతపురంలో ప్రసిద్ధులైన విద్వాంసుల దగ్గర సంగీతానికి మెఱుగులు దిద్దుకుంటోంది.

పెద్దలమీద యీమెకు ఉన్న భక్తి అపారం. విద్యలో యీమెచూపే ఆసక్తి అమితం. ఓర్పు, నేర్పు యీమెకు సహజాలంకారాలు.

చిరంజీవులకోసం తయారుచేసిన 'వెన్నముద్దలు' స్వీకరించటానికి యింతకు మించిన అర్హత యేముంటుంది? అందుకనే మేము వాటిని సంతోషపూర్వకంగా యీమెకు సమర్పింపదలచాం.

'కృతి' అయితే పూర్తి అయింది. కృతిస్వామిని నిర్ణయమయింది. కాని, కృతి ప్రచురణ మిగిలిపోయింది. 'అ దెలా జరుగుతుంది?' అన్న ఆలోచన నాకు అప్పుడు లేనేలేదు. అప్పుడే కాదు. యెప్పుడూకూడా లేదు. ఎందరో అడిగారు; ఇది కొన్నివేలు పెట్టుబడి పెడితేనే గాని జరిగే పని కాదే; మీ రెలా నిర్వహింప దలచారు?' అని. వారందరికీ నా సమాధానం యెప్పుడూ యిదే... 'ఇది వ్రాసే శక్తి యిచ్చినవాడే యిది ప్రచురితమయే అవకాశాన్ని కూడా కల్పిస్తాడు' అని. ఆ అభిప్రాయంతోనే నేను మద్రాసు చేరుకున్నాను.

మద్రాసులో నా కొక చిరకాల మిత్రుడున్నాడు. అతని పేరు వేమరాజు భానుమూర్తి. అతను సరసుడు, రసజ్ఞుడు. బహుగ్రంథకర్త. అతనిప్పుడు కేంద్రప్రభుత్వానికి సంబంధించిన ప్రెస్ యిన్ఫర్మేషన్ ఆఫీసర్‌గా ఉంటున్నాడు.

మద్రాసులో అడుగుపెట్టగానే నేను అతణ్ణి కలుసుకున్నాను. అప్పుడు నాదగ్గర ఉన్న, నేను వ్రాసిన, భాగవత రామాయణాలు అతనికి చూపించాను. భారతం వ్రాయబోతున్నానని చెప్పాను. ఇవి వెంట వెంటనే ప్రచురింపబడాలి అని కూడా అన్నాను.

మా 'భాను' నా గ్రంథాలు స్థాలీపులాకన్యాయంగా చూశాడు. చూసి, 'చాలా మంచిపని చేశారు' అని నన్ను అభినందించాడు. అంతేకాదు; 'మీ కోరిక శరవేగ తీరుతుంది' అని జోస్యంకూడా చెప్పాడు. అతని భావం అప్పుడు నాకు అర్థం కాలేదు. కాని సంతోషించాను. ఆ తరువాత, అతని సలహామీదనే నేను శ్రీయుతులు కాళహస్తి చంద్రమౌళీశ్వర శాస్త్రిగారిని కలుసుకున్నాను. శ్రీ శాస్త్రిగారు మంచి రసజ్ఞులు. సహృదయులు. వా రిప్పుడు, ఆంధ్రదేశంలో ప్రప్రథమ ప్రచురణ సంస్థ అయిన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారి వ్యవహారాలు నిర్వహిస్తున్నారు. వారు నా గ్రంథాలు చూశారు. చూసి, అతి ప్రశాంతంగా, 'ప్రెస్ కాపీలు తయారుచేయండి; ముద్రణ ప్రారంభిద్దాం' అన్నారు. అప్పుడు నాకు అనుభవంలోకి వచ్చింది; 'నిండుడు కుండ తొణకదు' అన్న సామెత. అప్పుడు నాకు అర్థమయింది; నా పరోక్షంలో మా 'భాను' నా కోసం చేసిన కృషి. ఈనాడు 'వెన్నముద్దలు' వెలుగు చూడటానికి ఆ యిద్దరు సహృదయులూ చేసిన సహాయం మరువరానిదనే చెప్పాలి.

ఈ సందర్భంలో మరొక విషయంకూడా మనవి చేసుకోవాలి. 'వెన్న ముద్దలు' తయారైన వెంటనే, వెంకట్రామా అండ్ కో అధిపతులైన శ్రీ ఈదర వెంకట్రావుగారిని కలుసుకోవటం జరిగింది. ఆ మహనీయుడు నా గ్రంథంలో కొన్ని భాగాలు విన్నారు. వినటమే కాదు; 'కృష్ణ జననా'నికి సంబంధించిన గాథను విడిగా ప్రచురించే పక్షంలో దాని కయ్యే ఖర్చునంతనూ తామే భరిస్తామన్నారు; అప్పటికప్పుడు నాకు నూటపదార్లు బహూకరించారు కూడా.

అదేవిధంగా హైదరాబాదులో ఉన్నమరొక సహృదయుని సహాయం కూడా నాకు లభించింది. ఆయన యాదవ వంశీయుడు. ఆయనకు నన్ను పరిచయ పరచింది యాదవ పితామహుడైన శ్రీ పోలా వీరయ్య యాదవగారు. ఎందుకనో గాని, ఆయనకు, నే నంటే అమితమైన అభిమానం కలిగింది. ఆయన సలహామీదనే శ్రీ పాపయ్య యాదవగారు నాకు మరో నూట పదార్లు కానికగా యివ్వటం జరిగింది.

ఈ విధంగా, భాగవతరచన ఉపక్రమించింది మొదలు, నాకు జరిగిన సహాయం యింతా అంతా కాదు. ఎందరో సహృదయులు నన్ను అభిమానించి అయాచితంగానే అమితమైన సహాయం చేస్తూవచ్చారు. అనుకోని విధంగా ప్రోత్సాహాన్నిచ్చారు. వారందరికీ నేను సర్వదా కృతజ్ఞుణ్ణి.

ఇక గ్రంథ విషయం.

'వెన్నముద్దలు' అన్నీ నాటకాలు. నాటిక లన్నా ఫరవాలేదు. వీటిలో ఉన్న మాటలూ పాటలూ మాత్రం నావి; పద్యాలు మన పోతనామాత్యునివి. అవకాశం ఉన్న చోటల్లా ఆయన పద్యాలు నేను వాడుకున్నాను. అంతేకాదు; అవసరమని తోచినప్పుడు వాటిల్లో కొన్ని పదాలూ పాదాలూ మార్చాను. నేను మార్చి వ్రాసిన భాగాలకు * గుర్తు ఉంటుంది. ఆ గుర్తు తరువాత ఉన్న ఒకటిరెండు పదాలు గాని, అటువంటి రెండు గుర్తుల మధ్య ఉన్న పాదాలుగాని నేను చేసిన మార్పులను సూచిస్తై. మిగిలిన వన్నీ "....." యీ గుర్తుల మధ్య ఉంటై. అవిలేని పద్యాలు కూడా కొన్ని కనబడతై. అవన్నీ నా 'బాల భాగవతం' లోంచి తీసుకున్నాను.

పోతన రచనకు కూర్పులూ మార్పులూ చేయబూనటం సాహస కార్యమే. అది నాకు తెలుసు. కాని, అటువంటి పనిచేశాను. నా అవసరానికి అది తప్పని సరికావటమే దానికి కారణం. అది గ్రహించిన సహృదయులు నన్ను మన్నిస్తారనే భావిస్తాను.

ఈ నాటికలు పిల్లలకోసమే వ్రాశాను. కాని, నాదృష్టిలో భాషా విషయికంగా పరిమితమైన జ్ఞానం కలవాళ్లు అందరూ పిల్లలే. ఇలా అన్నానని పెద్ద లెవరూ ఆగ్రహించరనుకుంటాను.

ఇక, యివి చదువుకునే వాళ్లు చదువుకోవచ్చు. ఆడుకునే వాళ్లు ఆడుకోవచ్చు. కాకపోతే, ఆడించేవాళ్లకుమాత్రం కొంచెంగానైనా రంగస్థలానుభవం ఉంటే అవి బాగా రక్తికడతై.

ఇవి, నాటకాల్లో పద్యాలు పనికిరాని రోజులు; అది నాకు తెలియక పోలేదు. అయినా, యీ నాటకాల్లో చాలా పద్యాలు వాడాను. అవన్నీ ఆయా స్థలాల్లో అవసరమే. కాకపోతే ఒద్దనుకున్న వాళ్లు వాటిల్లో కొన్నిటిని ఒదిలిపెట్టవచ్చు. చదువుకునే వాళ్లు మాత్రం చక్కగా వాటి నన్నింటినీ చదువుకుని సంతోషించవచ్చు.

మరొక విషయం ఉంది. రంగస్థలంమీద చూపించటానికి వీల్లేని ఘట్టాలు భాగవతంలో చాలా ఉన్నై. అలా అని వాటిని చెప్పకుండా ఉండటానికి వీలులేదు. అందుకనే, అటువంటి ఘట్టాలు వచ్చినప్పుడు ఒక కథకుణ్ణి ప్రవేశపెడుతూ వచ్చాను. అతని ద్వారా అదంతా చెప్పిస్తూ

వచ్చాను. ఇది నాటకీయతకు లోపమని కొందరు విమర్శకు లనవచ్చు. కాని ఈ నాటకాల ప్రయోజనాన్ని గ్రహిస్తే మాత్రం వారు నన్ను అంతగా దుయ్యబట్టరనే విశ్వసిస్తున్నాను.

ఇదంతా నామాట. ఇక, నారచనను గురించి యిద్దరు పెద్దలు యిచ్చిన అభిప్రాయాన్ని మాత్రం నివేదించుకుని సెలవు తీసుకుంటాను.

ఆంధ్ర అకడమీ ఉపాధ్యక్షులు, కవిసామ్రాట్
శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు :

"... భాగవత దశమస్కంధ గత కథ యంతయు చిన్న పిల్లలకోసము 32 చిన్న నాటికలుగా వ్రాసినారు. ఇందు మొదటి నాటక మంతయు చదివితిని. తక్కిన నాటకము లందందు చూచితిని. నేటి బాలుర కిది చాల యుపయోగమైన పని. ఈ మంచిపని చేసినందుకు వీరి నెంతయైన ప్రశంసింప వలయును. ఇది ప్రస్తుత మెంతో అవసరమైన పని, వీరి నెంతయయినను ప్రోత్సహింప దగియున్నది."

సాహిత్య అకడమీ సభ్యులు
సుప్రసిద్ధకవులు, శ్రీ పింగళి లక్ష్మీకాంతం గారు :

"... బాల కృష్ణునకు వెన్నముద్దలువలె నీ నాటికలు, 32 వెన్నముద్దలు, బాలురకే కాక ప్రౌఢులకు కూడ యెంతో రుచించునని నా నమ్మకము. ఇది ఒక ముద్ద చవి చూచి చెప్పిన మాట. భాగవత దశమస్కంధము, ఏకాదశ స్కంధము శ్రీ కృష్ణుని దివ్య చరిత్ర ఇతి వృత్తముగా గల భాగము. ఆ పవిత్ర గాథను పరమ రమణీయములైన పోతనగారి పద్యములను యిమిడ్చి నాటికలుగా సంతరించుట ప్రశంసార్హముగా ఉన్నది. నీ రచన ఇహ పరసాధనము. నీకును, నీ గ్రంథమునకును శ్రీకృష్ణుని శుభ వీక్షణము లభించుగాక."

మద్రాసు,
11—6—1959

సెలవు.
కృష్ణకవి



కృష్ణుని కత లివి, నేనా
కృష్ణుడ, గృతికర్త; నిది గ్రహించిన నీ వో
కృష్ణవు, సర్వము నివ్విధి
గృష్ణమయ మ్మగుట మన యదృష్టము కృష్ణా!





ఏ పాపల లే యెడదల
బాపములం బాపు తండ్రి వసియించెడినో
ఆ పాపల కనుపాపకు
శ్రీపతి కత మే యొసంగు చిరుకానిక యౌ.



పతి యెవ్వడు భూపతులకు,
గతి యెవ్వడు జగతి, కతడు గతిగా బతిగా
బ్రతుకున గల కృతి సేకొని
నుతికెక్కిన తల్లి మనెదు నూరేం డ్లిలపై.



చల్లని చూపుల కిల బు
ట్టిల్లౌ మన నల్లనయ్య హృదయము కృతియై
తల్లీ లభించె నీ, కా
చల్లని చూపులకు నీవ స్వామిని వికపై.



వెన్నముద్ద లుర్వి నున్నంతకాలమ్ము
'నల్లనయ్య' కతలు చెల్లువరకు
మా 'కుమారి కృష్ణ' మనుగడ మధురాతి
మధుర కావ్య మౌచు మహి రహించు.

 

★ నాటికలు ★


| | | |
|---|---|---|
| 1. శ్రీ కృష్ణ జననం | ... | 1 — 46 |
| 2. పూతన సంహారం | ... | 47 — 68 |
| 3. శకటాసుర భంజనం | ... | 69 — 82 |
| 4. తృణావర్త సంహారం | ... | 83 — 96 |
| 5. విశ్వరూప ప్రదర్శనం | ... | 97 —122 |
| 6. యమళార్జున భంజనం | ... | 123—146 |
| 7. విచిత్ర వధలు | ... | 147—180 |
| 8. కాళీయ మర్దనం | ... | 181—194 |



"నగుమొగముఁ సుమధ్యమును
నల్లనిమేనును లచ్చికాట ప
ట్టగు నురమున్ మహాభుజము
లంచిత కుండల కర్ణముల్ మదే
భ గతియు నీలవేణియు గృ
పా రస దృష్టియు గల్గు వెన్ను డి
మ్ముగ బొడజూపు గాత కను
మూసినయప్పుడు విచ్చినప్పుడుఁ"



## ★ ముఖ్యపాత్రలు ★

1. దేవకి
2. వసుదేవుడు
3. కంసుడు
4. నారదుడు
5. బ్రహ్మ
6. విష్ణువు
7. సరస్వతి
8. లక్ష్మి
9. భూదేవి
10. మహామాయ



# శ్రీకృష్ణజననం

## ★ 1. ప్రారంభం ★

[ అది బ్రహ్మదేవుని విలాస మందిరం.
అందులో సరస్వతీదేవి వీణ వాయిస్తూ ఉంది; ఆమె భర్త
అయిన బ్రహ్మ అది విని ఆనందిస్తున్నాడు.
అంతలో...

"నారాయణా నారాయణా నారాయణా శ్రీమ
న్నారాయణా నారాయణా నారాయణా భగవ
న్నారాయణా నారాయణా నారాయణా శ్రీమ..."

అనే పాట వారికి వినిపించింది; వారు అటుగా చూశారు.
సరస్వతీదేవి వీణ వాయించటం ఆపింది. ]

**బ్రహ్మ:** నారదమహర్షి వస్తున్నట్టున్నాడు.

**సరస్వతి:** అడుగో...రానే వచ్చాడు!

[ నారదుడు ప్రవేశించి వా రిద్దరికీ నమస్కరించాడు. ]

**బ్రహ్మ:** ... త్రిలోక సంచారులు కులాసాగా ఉన్నారా?

**నారదుడు:** ఆహా ... మీ దయ వల్ల...!

**సరస్వతి:** ఏదో పనిమీదే వచ్చినట్టున్నాడు!

**నారదుడు:** ఉహుం! పనిమీద వచ్చినా పడే అక్షింతలు పడు తూనే ఉన్నై; ఊరికే వస్తే ఊరుకుంటారా అమ్మా?

[ బ్రహ్మ సరస్వతీ మందహాసం చేస్తూ ఒకరి వంక ఒకరు
చూసుకున్నారు. ]

**బ్రహ్మ:** అదేమిటి మహర్షీ?

నారదుడు: మీకు తెలియనిదేముంది? నన్నిప్పుడు 'నారదా!' అని పిలిచే దెవరు...మహర్షి గదా అని మన్నించే దెవరు? నాకు ప్రపంచం పెట్టిన పేరు 'కలహ ప్రియుడు' అని. బాగుంది కదూ...?

[ ఆమాట అంటూనే నారదుడు పకపకా నవ్వాడు. బ్రహ్మ మందహాసం చేశాడు. ]

సరస్వతి: అజ్ఞానులు అనేక విధాల అనుకుంటారు; వారి మాట లన్నీ పాటిస్తే యెలా?

నారదుడు: కన్నతల్లివి కాబట్టి కడుపునిండే మాట అన్నావు!

బ్రహ్మ: ఇంతకూ యిప్పుడు యెక్కడనుంచి యీ రావటం?

నారదుడు: సరాసరి భూలోకం నుంచి.

సరస్వతి: అక్కడ అందరూ క్షేమంగా ఉన్నారా?

నారదుడు: క్షేమంగానా...? ఉహూఁ! క్షామంలో మునిగి తేలుతున్నారు!

 ్వతి: అయ్యయ్యో...! అదేమిటి?

నారదుడు: ఏముంది? ఇప్పుడు, అక్కడ అధికారమంతా అసురుల చేతుల్లో ఉంది. అక్కడి భోగభాగ్యా లన్నీ యిప్పుడు వాళ్ళవే. వాళ్ళ అత్యాచారాలకు హద్దూ పద్దూ అనేది కనబడటం లేదు.

ఇక ప్రజలమాట చెప్పేదేముంది? వాళ్ళు దినదిన గండంగా బ్రతుకుతున్నారు. ఏక్షణాన యేమౌ తుందో యెవరికీ తెలియకుండా ఉంది!

బ్రహ్మ: అయ్యో పాపం!

సరస్వతి: అయితే ... భూదేవి ...

నారదుడు: ఆవిడ యిప్పుడు ఓ కన్నీటికాలువగా తయారయింది.

[ అంతలో 'అంభా!' అని వినిపించింది. ఆ ధ్వని వచ్చిన వేపుగా వాళ్లు చూశారు. ]

... అదుగో ......!

[ తిరిగి అంధకారావం అయింది. మరుక్షణంలో భూదేవి లోపలకు వచ్చింది. ]

సరస్వతి: అయ్యయ్యయ్యో...! ఎటువంటి మనిషి యెలా అయి పోయింది!

[ అంటూనే ఆమెకు యెదురుగా వెళ్ళింది. ]

...రా అమ్మా...రా!

[ అంతలో భూదేవి సరస్వతిని సమీపించింది. సరస్వతి భూదేవిని దగ్గరకు తీసుకుంది. భూదేవి వెక్కి-వెక్కి యేడువ సాగింది. సరస్వతి ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించింది. ]

...ఇప్పుడే నీమాట అనుకుంటున్నాం!

[ భూదేవి సరస్వతిని కౌగిలించుకుంది. ]

ఏడవకు...! ఏడవకమ్మా...యేడవకు!!

భూదేవి: ఏడవక యేం చేసేది చెప్పండి! ఒకప్పుడు, 'నాకేం?' అని బ్రతికాను. కాని...

సరస్వతి: ఇప్పుడు మాత్రం యేమయింది? కష్ట మనేది యెవరి కైనా వస్తుంది. దాని కోసం కడుపు చెరువుచేసుకుంటారా?

భూదేవి: ( విచారాన్ని దిగమ్రింగుకుంటూ )

...కడుపున పుట్టిన బిడ్డలు కసాయి లయినప్పుడు కన్న తల్లికి కన్నీళ్ళేగా అమ్మా; శరణ్యం!

సరస్వతి: ఊఁ! కాదని కాదు. అయినా కాలం తప్పివస్తే యెవరు మాత్రం యేంచేస్తారు? ఏదో ఉపాయాన్ని ఆలోచించుకోవాలి; అపాయాన్ని తొలగించుకోవాలి. అంతేగా?

[ ఆమాట అంటూ ఆవిడ భూదేవి కన్నీరు తుడిచింది. ]

**నారదుడు:** ఉఁహూఁ! ఓర్పుకు యీావిడది పెట్టింది పేరు. ఈవిడే యిలా అయిందీ అంటే...

[ బ్రహ్మ నిట్టూర్చాడు. ]

...నిట్టూరి స్తే యేమౌతుంది ?

**బ్రహ్మ:** అదే...! ఏం చేయాలా అని ఆలోచిస్తున్నాను.

**నారదుడు:** ఆలోచించే దేముంది ? ఆవిడకు జరుగుతున్న అన్యాయాన్ని అరికట్టాలి; ఆవిడ శాంతించే పని చేయాలి ; అంతే !

**బ్రహ్మ:** ( తలవంచుకుని. )

అది...మనం అనుకుంటే అవుతుందా ?

**నారదుడు:** ......నారాయణ !...నారాయణ !!

**బ్రహ్మ:** ( తలయెత్తి; చిరునవ్వుతో )

...ఏం చేసినా ఆయనే చేయాలి !

**నారదుడు:** ఎవరు...? ఆ పురాణ పురుషుడా ?

**బ్రహ్మ:** ఆఁ...! ఆయనే !

[ సరస్వతి కొంచెం చిన్నపుచ్చుకుని తలవాల్చుకుంది. ]

**నారదుడు:** ఊఁ...! అయితే బయలుదేరండి ; అక్కడికే పోదాం !

నారాయణ...! నారాయణ...!!

[ ఆమాట అంటూనే నారదుడు లేచాడు. బ్రహ్మ కూడా ఆసనం మీాదినుంచి దిగాడు. ]



## ★ 2. వ, రంగం ★

[ వైకుంఠంలో విష్ణుమూర్తి శ్రీమహాలక్ష్మితో సహా కొలువు దీరి ఉన్నాడు. ఆయన చుట్టూ మునీశ్వరులు ఉచితాసనాల మీద ఉన్నారు. ]

మునిః 1. దేవాధిదేవా! నీ లీలలు వర్ణనాతీతాలు తండ్రీ !

“ మంచివారికెల్ల మంగళ ప్రదమయ్యు
కల్లరులకు మేలు కాని యట్టి
తనువు లెన్నియైన దాల్చి లోకములకు
సేమ మెల్ల ప్రోద్దు సేయు దీవు !”

[ అంతలో దూరంనుంచి బ్రహ్మాదుల ప్రార్థన వినిపించింది. అందరూ అటు చూశారు. ]

“గురుపాఠీనమవై జలగ్రహమవై క్రోడంబవై శ్రీనృకే
సరివై భిక్షుడవై హయాననుడవై క్ష్మాదేవతాభర్తవై
ధరణీనాథుడవై దయాగుణగణోదారుండవై లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద మిలాభారంబు వారింపవే.”

[ అడవరా అన్నట్టు విష్ణువు అటుగా చూశాడు. ]

బ్రహ్మాదులు:

...పురాణ పురుషాయనమః !

విష్ణువు: ఓ...మీరా...! రండి...రండి...!!

లక్ష్మి: భూదేవి కూడా వచ్చిందే !

[ దూరానికి చూసి, సరస్వతి కనబడగానే తలదించుకుంది. అది గ్రహించిన సరస్వతి చిరునవ్వు నవ్వింది. ]

విష్ణువు: ఊఁ...! కూర్చోండమ్మా ... కూర్చోండి ! ఏమిటి విశేషాలు ?

సరస్వతి: ( భూదేవిని చూపుతూ )
ఈవిడ పరిస్థితి చాలా అన్యాయంగా ఉందిట! అసుర పీడ అమితమై పోయిందిట !

**నారదుడు:** అది మీకు నివేదించు కుందామనే యిలా వచ్చాం!

**విష్ణువు:** ( దీర్ఘంగా ఆలోచిస్తూ భూదేవితో...)
ఊఁ...ఏమమ్మా...! అంతేనా...?

**భూదేవి:** అశాంతితో అటమటించి పోవటానికి అంతకంటె యేం కావాలి?

**విష్ణువు:** ఊఁహుఁ! భూదేవికూడా భరించలేకపోతోందీ అంటే పాపం పూర్తిగా పండిపోయిం దన్నమాటే!

**నారదుడు:** అదె అదె! మరోవిధంగా చెప్పాలీ అంటే, శ్రీహరికి, మళ్లీ చేతినిండా పని కలిగిందన్నమాట!

[ విష్ణువూ, లక్ష్మీ, మునీశ్వరులూ నవ్వుకున్నారు. ]

**విష్ణువు:** మనకు పనిలేని ముహూర్తమంటూఉందా; మహర్షీ?

**నారదుడు:** నారాయణ! నారాయణ!!

**విష్ణువు:** హిరణ్య గర్భు లేమంటారు?

**బ్రహ్మ:**...అనేందు కేముంది? ఏం చేయమంటే అది చేయటానికి సిద్ధంగా ఉన్నాం!

**విష్ణువు:** ఊఁ...! అయితే...

[ దగ్గరకు రమ్మని బ్రహ్మకు సైగచేశాడు. ఆయన అలా రాగానే ఆయన కేదో రహస్యంగా చెప్పాడు. ]

**బ్రహ్మ:** ...మహాప్రసాదం!

[ శ్రీహరి మందహాసం చేస్తూ తల ఆడించాడు. ]

**నారదుడు:** ...నారాయణ...! ...నారాయణ...!!



## ★ 3. వ, ర ం గ ం ★

[ దేవతలు బ్రహ్మకోసం యెదురు చూస్తున్నారు. అంతలో బ్రహ్మాదులు అక్కడకు వచ్చారు. ]

**దేవతలు:** ...భారతీ పతయే నమః!

**బ్రహ్మ:** ( సరస్వతితో... )
చూశావా...మన పని యెంత సులువై పోయిందో!

**సరస్వతి:** కాక యేమౌతుంది? అసలు పనేమో...యీ మహా తల్లిది; అది నెరవేర్చా లనుకున్నది ఆ శ్రీమహావిష్ణువు. ఇక చెప్పే దేముంది?

[ బ్రహ్మా నారదుడూ ఒకరివంక ఒకరు చూసుకున్నారు. ]

**దేవతలు:** మీరు వైకుంఠానికి వెళ్ళారని విని, అక్కడి విష యాలు తెలుసుకుందామని యిలా వచ్చాం!

**నారదుడు:** ( ఆనందంతో... )
నారాయణ...! ...నారాయణ...!!

**బ్రహ్మ:** ( భూదేవిని చూపుతూ... )
ఈవిడ మన సహాయం కోసం వచ్చింది!

**దేవతలు:** అయ్యయ్యో...యెంతమాట? సహాయ మేమిటి, సేవ చేయమన్నా చేస్తాం!

**నారదుడు:** ( సంతృప్తితో... )
నారాయణ...!...నారాయణ...!!

**బ్రహ్మ:** శ్రీహరి కూడా యిదే అభిప్రాయంతో ఉన్నారు!

**దేవతలు:** ( సంతోషంతో... )
ఐతే మాజీవితాలు సార్థకమైనట్టే...!

**బ్రహ్మ:** అంతేకాదు; బాధ్యతలు కూడా అధికమైనా యన్న మాట!

**దేవతలు:** ఆనందాన్ని కలిగించే బాధ్యత యెంత అధికమైతే అంత మంచిదికదూ!

**బ్రహ్మ:** ...ఐతే వినండి!

" యాదవకులమున నమరులు
మేదినిపై బుట్ట జనుడు మీా అంశములన్
శ్రీదయితుడు వసుదేవున
కాదరమున బుట్టి భారమంతయు బాపున్"

[ దేవతలందరూ గౌరవపూర్వకంగా తలలువంచి యెత్తారు. బ్రహ్మ, భూదేవితో... ]

ఇదే నమ్మా...ఆయన రహస్యంగా యిచ్చిన ఆజ్ఞ!

**భూదేవి:** ......అంతకంటె కావలసిం దేముంది?

[ భూదేవి బ్రహ్మ సరస్వతులకు నమస్కరించింది. బ్రహ్మ ఆమెవంక సానుభూతితో చూశాడు. సరస్వతి ఆమెను తిరిగి కౌగిలించుకుంది. ]

**నారదుడు:** సుఖీభవ...సుఖీభవ!!



## ★ 4. ప్రరంగం ★

[ దూరంగా మంగళ తూర్యనాదాలు వినిపిస్తున్నై. గుఱ్ఱాలు దగ్గరగా వస్తున్న చప్పుడవుతోంది. రథచక్రాల ధ్వని కూడా వినబడుతోంది. అంతలో రథం కనిపించింది.

రథంలో దేవకీ వసుదేవులు సుఖాసీనులై ఉన్నారు. కంసుడు సారథిగా వ్యవహరిస్తున్నాడు.

అంతలో 'కంసా! కంసా!!' అన్న పిలుపు వినిపించింది. పగ్గాలు పట్టి లాగి, గుఱ్ఱాలను ఆపుతూ, కంసుడు నలువంకలా చూశాడు; కాని, అతనికి యెవరూ కనబడలేదు. ]

**వసుదేవుడు:**...ఏమిటి బావా...అలా చూస్తున్నావు?

[ కంసుడు యింకా అటూ యిటూ చూస్తూనే ఉన్నాడు. ]

**దేవకి:** అన్నయ్యా...! ఏమిటిది?

**కంసుడు:** ( కలవరంతో )

ఎవరో పేరుపెట్టి పిలిచారమ్మా!

**వసుదేవుడు** ...అవును బావా...నేనూ విన్నాను. ఐనా ... యెవరూ కనబడటం లేదే!

**కంసుడు:** అదే ఆశ్చర్యంగా ఉంది!

[ ఆమాట అంటూనే కంసుడు తిరిగి పగ్గాలు వదిలాడు. గుఱ్ఱాలు ఒక అడుగు ముందుకు వేయగానే తిరిగి ఆకాశంలో నుంచి 'కంసా! ..ఓ కంసా!' అన్న పిలుపు వినిపించింది.

కంసుడు, మళ్లీ రథాన్ని ఆపాడు. ఆపి, క్రిందకు దిగాడు. అటూ యిటూ చూస్తూ ఒరలోనుంచి కత్తిని బయటకు దూసాడు. ]

**కంసుడు:** ...... ఎ వ ర ది ......?

**ఆకాశవాణి:**......నేను అశరీరవాణిని. నీ మేలుకోరి మాట్లాడుతున్నాను.

**కంసుడు:** ఆఁ......! నా మేలుకోరి మాట్లాడుతున్నావా? అయినా, నాకు యిప్పుడు వచ్చిన ఆపద యేముంది?

**ఆకాశవాణి:** ఆపదలో పడ్డ తరువాత అనుకుని మాత్రం చేసే దేముంది? వచ్చే కష్టాలను వారించుకోవటమే విశేషం. అదే నీకు గుర్తు చెయ్యాలనుకుంటున్నాను.

**కంసుడు:** కంసునికే కష్టాలు కలగటమా?

[ ఆమాట అంటూనే అతను విరగబడి నవ్వాడు. ]

**ఆకాశవాణి:** అహా! కాలం తప్పివస్తే కంసుడే కాదు; కాల కంఠుడు కూడా కష్టా లనుభవిస్తాడు!

**కంసుడు:** ( గంభీరంగా )

...ఆఁ...!

**ఆకాశవాణి:** ఔను. అది ముమ్మాటికీ నిజం!

[ అది విన్న కంసుడు తల వంచుకున్నాడు; ఆలోచనలో పడ్డాడు. ]

అందుకే నీకు ముందుగా చెబుతున్నాను.

[ కంసుడు తల యెత్తాడు. ]

"తుష్టయగు భగిని మెచ్చగ
నిష్ఠుడవై రథము గడపె దెలుగవు మీదన్
శిష్టయగు నీ తలోదరి
యష్టమ గర్భంబు నిన్ను హరియించు జుమీ!"

**కంసుడు:** ఆఁ! ఏమన్నావ్?

**ఆకాశవాణి:** మళ్లీ వినాలని ఉందా? అయితే విను!

"తుష్టయగు భగిని మెచ్చగ
నిష్ఠుడవై రథము గడపె దెలుగవు మీదన్
శిష్టయగు నీ తలోదరి
యష్టమ గర్భంబు నిన్ను హరియించు జుమీ!"

**కంసుడు:** నా చెల్లెలికి పుట్టిన వాళ్లు నన్ను చంపుతారా?

[ అంటూనే వెట్టిగా నవ్వాడు. ]

**ఆకాశవాణి:** ఏమిటి యీ అమాయకత్వం? నీవాళ్లైనంతలో నీకు అపకారం చెయ్యరని యెక్కడుంది? నేను చెబుతున్నాను; 'నామాట నమ్ము! నీ వాళ్లే నిన్ను చంపుతారూ!' అని.

**కంసుడు:** నమ్మవలసిన అవసరం నాకేమీ కనబడటం లేదు. నువ్వు, అన్నా చెల్లెళ్లమధ్య అగ్ని రగిల్చే పిశాచానివి కాని, నా మేలు కోరేదానివి కానేకావు!

( వసుదేవునితో )

......వింటున్నావా బావా!

[ అంత వరకు తలవంచుకుని ఉన్న వసుదేవుడు ఆతని మాట విని, 'బావా!' అంటూ అతణ్ణి కౌగిలించుకున్నాడు. ]

**కంసుడు:** ఊఁహూఁ! ఆ మాయలాడి మాటలు విని నేను మారిపోతా ననుకున్నావు...! అంతేనా?

**దేవకి:** అన్నయ్యా...! ఇంతకూ...అది...

**కంసుడు:** ఎవరైతే మనకేమమ్మా? అదేకాదు, అటువంటి కోటి కంఠాలు కోడై కూసినా కంసుడు కలవరపడటమనేది కలలో మాట!

**ఆకాశవాణి:** ( వికటంగా నవ్వి )

కంసా! ఎంతటి పిచ్చివాడవయ్యా!

**కంసుడు:** ( పైకి చూస్తూ )

ఏమిటి...? నాకా...పిచ్చి?

**ఆకాశవాణి:** ఆఁ...! నీకే! నిన్ను చంపేవాడు నీ చెల్లెలికి పుట్టబోతున్నాడు! ఆ చెల్లెలినే నువ్వు అమితంగా అభిమానిస్తున్నావు! ఇంతకు మించిన పిచ్చిపని యింకేమైనా ఉంటుందా?

[ కంసుడు మతి చలించినట్టుగా నవ్వుతున్నాడు. ]

**వసుదేవుడు:** బావా!...బావా!! ఏమిటీ ఉన్మాదం?

**కంసుడు:** నేను పిచ్చివాణ్ణి బావా...ఉట్టి పిచ్చివాణ్ణిట; ఆకాశ వాణి చెబుతోంది!

[ ఆమాట అంటూనే కంసుడు విరగబడి నవ్వాడు. ]

**దేవకి:** అన్నయ్యా...! అన్నయ్యా! ఏమిటీ అన్యాయం?

[ కంసుడు యింకా నవ్వుతూనే ఉన్నాడు. ]

**ఆకాశవాణి:** నవ్వు! ఇంకా నవ్వు! పొట్ట పగిలేటట్టు నవ్వు! అల్లుడిచేతులో అవమానంతో చచ్చేకంటె యిలా పిచ్చెక్కి చావటమే మంచిది. నవ్వు! బాగా నవ్వు!!

[ కంసుడు నవ్వి నవ్వి ఉన్మాదిలా తయారైనాడు. అతణ్ణి చూస్తుంటే దేవకికే భయంవేసింది. ఆవిడ కెవ్వు మని కేక పెట్టింది. ఆవెంటనే కంసుడు ఆమె మీదికి ఉరికాడు. ఆమె జుట్టు పట్టుకున్నాడు. ]

**వసుదేవుడు:** ...బావా! కంసా...! ఏమిటీ అత్యాచారం?

**దేవకి:** ( దీనంగా... )

అన్నయ్యా...!అన్నయ్యా...!!

**కంసుడు:** ( వికటాట్టహాసం చేస్తూ... )

అ...న్న...య్య! అన్నా లేదు, చెల్లెలూ లేదు. ఊఁ...!

[ ఆ మాట అంటూనే కత్తి ఎత్తి ఆమె తల నరకబోయి నాడు. అది చూసిన వసుదేవుడు అతనిచేతిని గట్టిగా పట్టుకుని ఆకత్తి ఆమెమీద పడకుండా ఆపాడు. ]

**వసుదేవుడు:** ...బావా! ఇంత అఘాయిత్యమా? చెల్లెలినే చంపటమా?

**కంసుడు:** ( వికటంగా నవ్వుతూ... )

...నేను చంపేది చెల్లెలిని కాదు బావా ... నన్ను చంపబోయే వాడి తల్లిని!

**దేవకి:** అన్నయ్యా...! అన్నయ్యా...!! నే నేంపాపం చేశా నన్నయ్యా?

**కంసుడు:** ... పాపానికి పాల్పడ్డ వాళ్లను శిక్షించే కంటె, ఆ పాపానికి అవకాశం లేకుండా చెయ్యటం చాలా ప్రశస్తమైన విషయం. అసలు రాజధర్మం కూడా

అదే. ఊఁ...! నీ రోజులు నిండిపోయినై. చివరి ప్రార్థన యేదైనా ఉంటే చకచకా పూర్తిచేసుకో!

**వసుదేవుడు:** ( దీనంగా )

బావా! అనవసరంగా తొందర పడుతున్నావు! అన్యాయానికి పూను కుంటున్నావు!

"అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు సీర లిచ్చుటో
మన్నన సేయుటో మధురమంజుల భాషల నాదరించుటో
మిన్నుల ముట్టెతలే నిజము మేలని చంపకుమన్న మానిరా
వన్న శమింపుమన్న తగదన్న వధింపకు మన్న వేడెదన్"

**కంసుడు:** ... వసుదేవా...!

**వసుదేవుడు:** ...అంత కోపం దేనికి బావా? అదీకాక...

"చెలియల్ కన్నియ ముద్దరా లబల నీ సేమంబె చింతించు ని
ర్మల దీనిన్ బయలాడు మాటలకునై మర్యాద బోదట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా కోపంబు పాపంబు నె
చ్చెలినో హో తెగవ్రేయ బాడియగునే చింతింపుభోజేశ్వరా!"

**కంసుడు:** ( వికటాట్టహాసం చేస్తూ )

ఉఁహుఁ! పాప పుణ్యాలు పరిశీలిస్తూ ప్రాణానికి ముప్పు తెచ్చుకోవటం ప్రతిభావంతులు చేసే పని కాదు!

**వసుదేవుడు:** ...బావా! ... బావా...!! ఏమిటీ పట్టుదల? కూతురు వంటి చెల్లెలిని, క్రొత్త పెళ్లికూతుర్ని, ఉత్తమురాలిని యిలా నిష్కారణంగా నీకత్తికి బలిచేసు కుంటావా? ఇంతటి ఘోరపాపానికి ఒడికట్టు కుంటావా? వద్దు బావా...వద్దు! నామాట విను!

**కంసుడు:** ( వికటంగా నవ్వుతూ )

నీమాట వింటే నా బ్రతుకు నీటిమూట అవుతుంది; అది గ్రహించావా?

**వసుదేవుడు:** బావా! ఆపదను తొలగించుకునే మార్గం ఆలోచించాలి గాని, అమాయకులను హత్యచేస్తే యేమౌతుంది ?

**కంసుడు:** ( హేళనగా అతని వంక చూస్తూ... )
ఆ మార్గమేదో మీరే చెప్పండి; అదీ చూద్దాం!

**వసుదేవుడు:** అలా అన్నావు...బాగుంది! చూడు...!
" లలనకు బుట్టిన కొమరుని
వలనన్ దెగె దనుచు గగనవాణి పలికె నం
చలిగెద వేని మృగాక్షికి
గల కొడుకుల జంపనిత్తు గ్రమమున నీకున్ "

**కంసుడు:** ......భేష్...భేష్...!! ఆలోచన అంటే అలా ఉండాలి!
( తిరిగి కొంచెం ఆలోచించి )
అయినా, ఆడి తప్పని వాడవు, నువ్వు, అలాచేద్దామనే అనుకోవచ్చు. కాని, కడుపు తీపితో అప్పుడు యీవిడ అడ్డుపడితే...?

**వసుదేవుడు:** అటువంటి దేమీ జరగదు బావా! అంతగా కావాలంటే యీవిడచేతఅలా ప్రమాణంకూడాచేయిస్తాను. నీ చెల్లెలిమీద నీకు ఆ మాత్రం విశ్వాసం లేదూ ?

**కంసుడు:** ఊఁ...! అదీ బాగానే ఉంది!
( దేవకితో )
ఏమమ్మా...! ఏమంటావ్ ?

**దేవకి:** ( విచారంతో )
అనటాని కేముం దన్నయ్యా ? వా రెలా చెబితే అలా చేస్తాను! నీ మేలుకంటె మాకు కావలసిం దేముంది?

**కంసుడు:** ( సంతోషంతో )
సెబాస్! ఇక మనం నిశ్చింతగా వెళ్లవచ్చు. ఊఁ... బయలు దేరండి!

[ దేవకీ వసుదేవులు రథం యెక్కడానికి కంసుడు చేయూత నిచ్చాడు. ]



## ★ 5. వ రంగం ★

[ దేవకీ దేవి అత్తవారింట్లో అడుగుపెట్టి అప్పటికి ఒక సంవత్సరం అయింది.

ఓ నాడు...ఆ ఊళ్లో నీలాటిరేవుదగ్గర...... ]

పడుచు: 1. ...విన్నావా...అక్కయ్యా!

2. ... ఏమిటీ... ?

1. అదే! మన దేవకీదేవి రేపో మాపో తల్లి కాబోతోందిట!

2. ... నిజంగానా... ?

3. ఆఁ ...ఉట్టిది! అలాగే అయితే యీ పాటికి ఊరంతా ఉత్సవాలు జరుగుతూ ఉండేవి కదూ!

2. అలా అనటానికి వీల్లేదమ్మా! ఇది రహస్యంగా ఉంచటంలో యేదో అభిప్రాయం ఉండే ఉంటుంది.

1. మంచి మాటన్నావు! నాకు చెప్పినవాళ్లు కూడా అలాగే అన్నారు.

2. ఔను పిన్నీ, అంతే అయి ఉంటుంది. ఆవిడ కడుపు పండిందీ అంటే ఆవిడ అన్నగారి కడుపు మండిపోతుందని విన్నామా లేదా? అదే దీనికి కారణం కావచ్చు. ఏ మంటావు?

4. ...ఇంకా సందేహమా?

1. ఊహుఁ! ఇప్పుడు యెవరిని కదిలించినా యిదే మాట! అసలు విషయ మేమిటో ఆ పరమాత్ముడికే తెలియాలి.

2. ఊఁ... బాగానే ఉంది!

4. అందుకనే కాబోలు; యెప్పుడు చూసినా ఆ మహాతల్లి అదో విధంగా ఉంటుంది!

1. ఊహూఁ... పాపం! కాదూ మరి ?

2. ఆ విషయం అనుకోవటానికే కష్టంగా ఉంది; అనుభవించటం అంటే మాటలా ?

3. అయినా మన కెందు కొచ్చింది? ఆ నోటా ఆనోటా యిది ఆ 'పుణ్యాత్ముడి' చెవులో పడితే ఆవిడ మన ప్రాణానపడి ఉసూరు మంటుంది. ఏమంటావు అత్తయ్యా!

1. అంతే నమ్మా...అంతే! మన సంతోషం మనలోనే ఉంచుకుంటే యేబాధా లేదు.

[ ఆమాట అంటూనే ఆవిడ అక్కడినుంచి కదిలింది. ఆవిడవెనుకనే మిగిలినవాళ్లు కూడా వెళ్లారు. ]



## ★ 6. వ రం గం ★

[ కంసుడు తన ఆలోచనా మందిరంలో అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. అతనిలో అశాంతి అమితంగా కనబడుతోంది. అతని ప్రక్కనే అతని మంత్రులున్నారు. ]

కంసుడు: ఊఁ... ! అనుకున్నంతా అయిందన్నమాట !

మంత్రి: 1. అలాగే అనిపిస్తోంది ప్రభూ !

2. దేవకీ దేవి ప్రసవించిందని యింతవరకు దేవతలకూడా తెలియదు ; అదీ విచిత్రం.

కంసుడు: ఉఁహూఁ ! కృతఘ్నులు !

( అటూ యిటూ తిరుగుతూ .. )

మా చెల్లెలే మాకు ద్రోహం తలపెట్టినప్పుడు యితరుల మాట చెప్పేదేముంది ?

[ కంసుడు అలా ఆలోచిస్తూ ఉండగానే వసుదేవుడు లోపలకు వచ్చాడు ; వస్తూనే అతనిమాటలు విన్నాడు; పొత్తిళ్లలో కప్పబడి ఉన్న పసి పాపను అడ్డంగా పట్టుకుని అడుగుల్లో అడుగులు వేసుకుంటూ కంసుని వేపుగా వెళ్లాడు. ]

వసుదేవుడు: ...బావా... !

[ కంసుడు వసుదేవుని వేపు తిరిగాడు ; అతనివంక చూశాడు ; తన కళ్లను తానే నమ్మలేకపోయినాడు. ]

నీ చెల్లెలు నీకు చేసిన ద్రోహం యేముంది బావా ? కడుపు తీపినికూడా కాదని అన్నమాట ప్రకారం కన్న బిడ్డను కత్తికి ఫలహారంగా పంపించింది. ఇదుగో... ! తీసుకో బావా !...తీసుకో !!

[ కంసుడు విస్మయాన్ని పొందాడు.
అతని మంత్రులు అతనికి కొంచెం దూరంగా తొలగి నుంచున్నారు. కంసుని ముఖంలో క్రమక్రమంగా ప్రసన్నత గోచరించింది. అతను మెల్లమెల్లగా వసుదేవుని సమీపించాడు.

వసుదేవుడు కంసుని వంక దీనంగా చూశాడు. కంసుని ముఖంలో అతనికి సానుభూతి గోచరించింది.

ఒకక్షణం మౌనంగా నుంచుని కంసుడు ఆ పాప మీది ముసుగును ప్రక్కకు తొలగించాడు. అతని ముఖంలో చిరునవ్వు చిందులేసింది. అది గ్రహించిన వసుదేవునిలో యేదో ఆశ ప్రవేశించింది. అంతవరకు అతని ముఖాన ఉన్న విషాదచ్ఛాయలు కొద్దిగా చెదరి పోయినై పసిపాపవంకా, వసుదేవునివంకా చూస్తూ కంసుడు విపరీతంగా నవ్వాడు. ఆ నవ్వులో క్రూరత్వం కనబడలేదు. ]

...అల్లునిమీద మామకు అనుగ్రహం కలిగినట్టుందే!

[ కంసుడు అతనివంక సానుభూతితో చూశాడు. ]

...అయినా అంతటి అదృష్టానికి ఆ చెల్లెలు నోచుకుందా బావా!

[ కంసుని చిరునవ్వు క్రమక్రమంగా కరిగిపోయింది. అతనిలో గాంభీర్యత ప్రవేశించింది. ]

కంసుడు: బావా! కపటం లేకుండా, ఆడినమాట తప్పకుండా మీ దంపతులు అన్నంతపనీ చేశారు. అదే యిప్పుడు యీ పసిపాపకు ప్రాణదానం చేస్తోంది.
...ఇతనివల్ల అపాయం కలుగుతుందన్న అనుమానం మాకు యేమాత్రం లేదు. ఇదే మా అభిప్రాయంగా మా చెల్లెలికి మనవి చేయండి!

( ఓ ప్రక్కకు చూసి... )

...ఎవ రక్కడ...?

మంత్రి: 2. ఏం సెలవు?

కంసుడు: మా అల్లుడుగారు మాకోసం వచ్చి వెడుతున్నారు. వారిని సగౌరవంగా సాగనంపాలి.

[ మంత్రి అతనిమాటలను తలదాల్చి లోపలకు వెళ్ళాడు. ]

...ఏరీ...! అల్లుడుగారేరీ...!

( వసుదేవు డందించిన పిల్లవాణ్ణి అందుకుని .. )

ఈ చిరంజీవి కీర్తిమంతుడు కావాలని కోరుతున్నాం బావా!

వసుదేవుడు: (అమితోత్సాహంతో కంసుని కౌగిలించుకుని...)

...బావా...! ఇప్పుడు మాచెల్లెలే యిక్కడ ఉంటే యెంతగా సంతోషించేదో...! నిన్ను యెంతగా ప్రశంసించేదో...! అబ్బ...! నిన్ను యీమాత్రం అర్థంచేసుకోలేక యెంత బాధపడ్డాం బావా! ...బావా!!

[ వసుదేవుడు సంతోషంతో ఒణికిపోయినాడు. అతణ్ణి చూస్తున్న కంసుని కళ్లు చెమ్మగిల్లినై. ]



## ★ 7. వరంగం ★

[ దేవకీదేవి కాపురానికి వెళ్లి ఆరేళ్లయింది.
అప్పటికి ఆమె సంతానం ఆరుగురు బిడ్డలు.
ఆరోజున గోకులంలో వసంతోత్సవం జరుగుతోంది. దేవకీ
వసుదేవులు తమభవనంలో దంపతిపూజ చేస్తున్నారు. ]

**ముత్తయిదువు:** ...ఆ మహాతల్లిని చూస్తే చాలు జన్మ తరించి పోతుంది!

**ఆమెభర్త:** ఆ మహారాజు మాత్రం యేమంత తక్కువవాడా? అన్నమాట తప్పకుండా కన్నకొడుకులు ఆరుగురినీ కంసుని కత్తికి ఒప్పగించాడు. ధర్మవీరుడంటే ధర్మవీరుడు ఆయనే!

**ముత్తయిదువు:** ఇంకా నెమ్మదిగా అంటారేం...? ఆయనలో ఆ ధర్మనిష్ఠే లేకపోతే యీ పసిపాపలు యేనాడో పరలోకం చేరేవాళ్లు.

**ఆమెభర్త:** ఆహా; నిస్సందేహం గాను!

**ముత్తయిదువు:** ఏదో ... ఈమాటుకూడా ఆ గండంగడిచి ఆవిడ బయట పడితే...

**ఆమెభర్త:** (చిరునవ్వుతో...)
ఏముంది...; ఆకాశవాణి అన్నంతా అయితీరుతుంది!

**ముత్తయిదువు:** ...ఆ రోజంటూ రావాలిగా...!

**ఆమెభర్త:** రాకేం చేస్తుంది? ముత్తయిదువులందరూ ఒత్తిడి చేస్తే మృత్యుంజయుడే ఆ కుటుంబానికి అండగా నుంచుంటాడు.

[ అలాగే కావాలన్నట్టుగా ఆమె తల ఆడించింది. ముసిముసి నవ్వులతో ముందడుగువేసింది. ఆమె భర్త ఆమెను అనుసరించాడు. ]



# ★ 8. వరంగం ★

[ బాణ, భౌమ, మాగధ, మహాశన, కేశి మొదలైన సహచరులతో
కంసుడు కొలువుదీరి ఉన్నాడు .
అంతలో నారదుని వీణా స్వనం వినిపించింది. ]

నారదునిగొంతు: "నారాయణా నారాయణా నారాయణా శ్రీమ
న్నారాయణా నారాయణా నారాయణా భగవ
న్నారాయణా నారాయణా నారాయణా... "

[ నారదుడు ప్రవేశించాడు. సభికులందరూ లేచినుంచున్నారు. ]

కంసుడు: కలహప్రియులకు కంసుడు నమస్కరిస్తున్నాడు !

నారదుడు: ( ...వికటంగా నవ్వి... )
సత్యదర్శనప్రాప్తి రస్తు !

కంసుడు: ( చకితుడై... )
అదేమి దీవన మహర్షీ? మేము సత్యాన్ని గ్రహించని దెప్పుడు... ?

నారదుడు: ( వికటంగా... )
'గ్రహించిందెప్పుడు ?' అని అడిగి ఉంటే, మాకు సమాధానం దొరికేదే కాదు.

[ కంసుడు కొంచెం కలవర పడ్డాడు . అతని సహచరులు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]

కంసుడు: ( లేని చిరునవ్వును తెచ్చిపెట్టుకుంటూ .. )
మహర్షులు మా మనసును మధన పెడుతున్నారు !

నారదుడు: ...అయితే మా పుణ్యం పండిందన్నమాటే !

కంసుడు: ఆర్యుల వచనాలు మాకు అగ్రాహ్యంగా ఉన్నై !

నారదుడు: అదేమిటి మహారాజా ? మా మాటల్లో మర్మ మేముంది? ఆగర్భశత్రువులకు అద్భుత సన్మానం చేస్తున్న మీరు కొంచెం కష్టపెట్టే మాకు కొద్ది సన్మానమైనా చేయక పోతారా అని !

కంసుడు: ( ఆశ్చర్యంతో... )
...ఆ గర్భ శత్రువులా... ? వారిని మేము అద్భుతంగా సన్మానించటమా... ? మాకు అదేమీ అర్థం కావటంలేదే !

నారదుడు: ...ఈ మధ్య తమరు అల్లుళ్ళ మీద చూపిన అభిమానాన్ని యే మనాలి మహారాజా ?

కంసుడు: ( అర్థమైనట్లు తల పంకించి )
ఊఁ...! మా అల్లుళ్ళే మాకు శత్రువు లన్న మాట !

నారదుడు: అదేగా ఆకాశవాణి చెప్పింది ! అప్పుడే మరచి పోయినారా ? ...సురలైన యాదవులు నరులనేగా మీ అభిప్రాయం ? మీరూ మీ వాళ్ళూ రాక్షసులనీ, మిమ్మల్ని హత మార్చటానికే శ్రీహరి పుట్టబోతున్నాడనీ మీకు యే మాత్రమైనా తెలుసా ? ఉహుఁ ! ఇంతవరకు 'అసురాధిపతి ఆవులిస్తే ప్రేవులు లెక్క పెడతాడు' అనుకుంటున్నాం!...కాని, యిప్పుడు...

[ 'ఎందుకూ పనికి రాకుండా పోయినాడు' అన్నట్టుగా తల ఆడించాడు]

కంసుడు: ... మహర్షి !

నారదుడు: ఉహుఁ ! మహారాజులకు మంచిమాట చెప్పటమే తప్పన్న మాట! అయినా...నాకెందు కొచ్చింది... ? నారాయణ... !

[ అంటూనే నారదుడు అక్కడనుంచి కదిలాడు. ఆయనను వెనుకకు పిలవాలన్నట్టుగా కంసుడు ఒక సారి ఆయనవంక చూశాడు ; ఆగాడు ; తలవాల్చుకున్నాడు .

కంసునిలో తిరిగి యేదో ఆలోచన ప్రవేశించింది. అతడు తిరిగి నారదుని వంక చూశాడు ; కాని, అప్పుడుకూడా అతణ్ణి పలుకరించే పని మానుకున్నాడు ; ముఖం ప్రక్కకు త్రిప్పుకున్నాడు. ]

కంసుడు: ... భామా !

భాముడు: ... స్వామీ... !

కంసుడు: నువ్వు... వెంటనే శూరసేనుని రాజ్యానికి వెళ్లాలి. వెళ్లి అక్కడున్న దేవకీ వసుదేవులనూ వారి సంతానాన్నీ బంధించి తీసుకురావాలి. వింటున్నావా!

[ ఆమాట అని అతను తిరిగి అటూ యిటూ పచార్లు చేయటం మొదలుపెట్టాడు .
భౌముడు అతనికి గౌరవం చూపి అక్కడనుంచి కదిలాడు . ]

... ఉహు ! కరుణామయుడు కావటమే కంసుని దోసమన్న మాట !

[ అలా అంటూనే అతడు ఖడ్గంమీద చేయివేశాడు . దాన్ని ఒరలోంచి, కొద్దిగా, బయటకు లాగాడు . ]

ఇక యీ ఖడ్గ దాహం తీరాలి...కంసుడు కునుకు తీయాలి . అంతే !

[ అంటూనే ఖడ్గాన్ని ఒరలో దించేశాడు ]

...ఎ వ ర క్క డ...?

ఒక రాక్షసుడు: ... ఆజ్ఞ ప్రభూ !

కంసుడు: దేవకీ వసుదేవులు కళ్లబడగానే కారాగారంలో పడేయండి! వారి కాళ్లకూ చేతులకూ సంకెళ్లు వేయండి!...ఇక, వారి పిల్లలను కత్తితో ముక్కగా కోసి మా కళ్లముందు పెట్టండి! ...వద్దు వద్దు...! వాళ్లని మాకే ఒప్పచెప్పండి !
...అసురాధిపతి అసురాధిపతిగానే జీవిస్తాడు; అవసరమైతే అలాగే మరణిస్తాడు కూడా !

[ అలా అంటూనే తిరిగి వికటంగా నవ్వసాగాడు . నవ్వుతూనే అక్కడినుంచి వెళ్లిపోయినాడు. ]



## ★ 9. వరంగం ★

[ కంసుని రాజ్యంలో యెక్కడ చూసినా కల్లోలమే కనబడుతోంది. మూటాముల్లే కట్టుకుని యెక్కడి వాళ్లు అక్కడినుంచే పారిపోతున్నారు. ]

**తండ్రి:** ...అవీ యివీ వెతుక్కుంటూ కూర్చుంటే అసలు ప్రాణాలకే మోసంవస్తుంది ; వెంటనే బయలు దేరాలి!

**కూతురు:** (తల్లితో...)

...ఎక్కడి కమ్మా, మనం యిప్పుడు వెళ్లేది ; అమ్మమ్మ గారి యింటికా ?

**తల్లి:** కాదమ్మా...కాదు ; ఆ కంసుడికి కనబడకుండా యే అడవిలోనో తలదాచు కోటానికి!

**పిల్ల:** అడవిలోనా...? అమ్మ బాబోయ్...! అక్కడ సింహాలూ పెద్దపులులూ ఉండవూ ?

**తల్లి:** అవి ఉన్నా అంత భయం ఉండ దమ్మా! ఈ రాక్షసుల కంటే అవి చాలా నయం. ఆకలి వేసినప్పుడే అవి మనుష్యుల మీదపడి పీక్కుతింటాయి. వీళ్లు అలా కాదు ; అనవసరంగా హత్యలు చేస్తారు. అందులో, కంసుడి బంట్లు మరీను!

**తండ్రి:** ఊహుఁ! అందుకనే పెద్దలు చెప్పారు...

"తల్లి తండ్రి నైన దమ్ముల నన్నల
సఖులనైన బంధుజనుల నైన
రాజ్య కాంక్షజేసి రాజులు చంపుదు
రవని దఱచు జీవితార్థులగుచు" అని.

**పిల్ల:** అబ్బా...! రాక్షసులు అంత చెడ్డవాళ్లా అమ్మా? అయితే మనం వెళ్లిపోదామమ్మా! ఇప్పుడే వెళ్లి పోదా మమ్మా!!

  

[ ఆ విధంగా యాదవులందరూ తమ తమ యిళ్లూ వాకిళ్లూ వదలి నిషధ, కురు, కోసల, విదేహ, విదర్భ, కేకయ, పాంచాల, సాల్వ దేశాలకు పారిపోయినారు. ]



## ★ 10. వ రంగం ★

[ ఆ తరువాత కొంత కాలానికి, ఒకరోజున, వైకుంఠంలో విష్ణుమూర్తి లక్ష్మీ మాట్లాడుకుంటున్నారు. ]

**లక్ష్మి:** ...తిరిగి మనం కలుసుకోవటం...

**విష్ణువు:** భూలోకంలోనే! కుండిన భర్త అయిన భీష్మక మహారాజు మందిరంలో... క్రొత్త పెళ్లికొడుకూ క్రొత్త పెళ్లికూతురూ మాదిరి.

**లక్ష్మి:** ( ముసిముసినవ్వులతో )

అది తలచుకుంటే ఆనందంగానే ఉంది; కాని, అంత దాకా...

**విష్ణువు:** ఏం చేస్తాం...? మానవ లోకానికి మేలు చేయాలనుకుంటే మనం కొంతకాలం వేరు కావలసిందే!

**లక్ష్మి:** మాయకూడా మీతో ప్రయాణమౌతున్నట్టుందే!

**విష్ణువు:** అయ్యో!...ఆవిడ లేకపోతే యెలా? అసలక్కడ జరిగేపనంతా ఆవిడమీదే ఆధారపడి ఉంది.

**లక్ష్మి:** అదుగో...అనుకుంటూ ఉండగానే వచ్చింది కూడా!

**మాయ:** ( ప్రవేశించి, వారికి నమస్కరించి... )

...ఉన్నపాళంగా రమ్మన్నారుట; యెందుకమ్మా?

**లక్ష్మి:** అదే యిప్పుడు చెబుతున్నారు; యేదో పెద్దపనే ఉందిట!

**విష్ణువు:** ఔనమ్మా! చాలా అవసరమైన పనికూడాను! భూలోకంలో ప్రజ లందరూ మనమీద ఆశపెట్టుకుని బ్రతుకుతున్నారు. వారిని మనమిప్పుడు ఆదుకుతీరాలి. ఇందులో యేమాత్రం ఆలశ్యమైనా, కంసుని ఖడ్గం వాళ్లందరినీ కబళించేస్తుంది.

**మాయ:** అయ్యో పాపం...! అంతపనే? అయితే నన్నిప్పుడు యేం చేయమంటారు?

విష్ణువు: ఏం లేదు...! ఆదిశేషుని అంశం ప్రస్తుతం దేవకీదేవి గర్భంలో ఉంది. ఆ తేజాన్ని నువ్వు నందగోకులంలో ఉన్న రోహిణి గర్భాన పడేయాలి! అంతే!

మాయ: దానికేం? ఆపని ఇప్పుడే చేస్తాను!

విష్ణువు: ఆఁ! చెప్పటం మరచాను. ఆ తరువాత మరో చిన్న పనికూడా ఉంది.

మాయ: ఏమిటది?

విష్ణువు: అక్కడ నందగోపుని భార్య యశోద అని ఉంటుంది. ఆమెకు నువ్వు భద్రకాళివై పుట్టాలి.

మాయ: ( సంతోషంతో )

ఓ...! అంతకంటేనా...!

విష్ణువు: ఈలోపుగా నేను దేవకీదేవి కడుపున జన్మిస్తాను.

మాయ: మీరుకూడా వస్తున్నారన్న మాట!...అయితే...మా అమ్మ...?

విష్ణువు: మనం యెక్కడ ఉంటే ఆవిడ అక్కడే ఉంటుంది, కాక బోతే, నామరూపాలు మార్చుకుంటుంది; అంతే!

లక్ష్మి: ( చిఱునవ్వుతో )

అన్నింటికీ ఒప్పుకునేగా మీ యింటికి వచ్చాను!

[ విష్ణుమూర్తీ లక్ష్మీ ముసిముసినవ్వులు నవ్వుతున్నారు ]

మాయ: ఊఁ...! ఐతే, వెళ్లిరమ్మంటారా!

విష్ణువు: సుఖంగా వెళ్లిరా అమ్మా!

[ మాయ ఆ దంపతులకు నమస్కరించింది. అక్కడనుంచి కదిలింది. విష్ణువూ లక్ష్మీ మందహాసం చేస్తూ ఆమెవంక చూశారు. ]



## ★ 11. వ ర ం గ ం ★

[ అది దేవకీ వసుదేవులున్న చెరసాల. అందులో ఒక తెరకట్టి ఉంది; దేవకీదేవి తెరకు అవతల ఒక మంచం మీద కూర్చుని ఉంది; ప్రసవ వేదన పడుతోంది.

ఇటు ప్రక్క వసుదేవుడు అమితమైన విచారంలో మునిగి ఉన్నాడు. అతని కాళ్లకూ చేతులకూ సంకెళ్లు ఉన్నై. ]

**దేవకి గొంతు:** ...పరాత్పరా! జగద్రక్షకా! ఆపదోద్ధారకా !!

**వసుదేవుడు:** దేవదేవా! ఈ కష్ట సముద్రంలోంచి మేమెప్పుడు బయట పడతాం నాయనా? ప్రపంచ పరిస్థితి నీకు అర్థం కావటం లేదా తండ్రీ?

"ముచ్చిరి యున్నది లోకము
నిచ్చలు కంసాది ఖలులు నిర్దయు లేపన్
మచ్చిక గావగ వలయును
విచ్చేయుము తల్లి కడుపు వెడలి ముకుందా!"

[ అంతలో ఒక మెరుపు మెరిసినట్టయింది. ఆ వెంటనే లోపలనుంచి ఒక పసిపిల్లవాని యేడుపు వినిపించింది. అది విన్న వసుదేవుని ముఖం విప్పారింది. ]

పరమేశ్వరా! నీ లీలలు వర్ణనాతీతాలు తండ్రీ!

[ వసుదేవుడు అలా అంటూ ఉండగానే అక్కడ పుష్పవర్షం కురిసింది. శంఖకాహళధ్వనులు వినిపించినై. వసుదేవుడు పైకి చూశాడు. ]

**బ్రహ్మాదుల గొంతు:**

" ధరణీభారము వాసెను
పురుషోత్తమ యీశ నీదు పుట్టువున; భవ
చ్చరణాంబుజముల ప్రాపున
ధరణియు నాకసము గాంచెదము నీకరుణన్ "

[ అది విన్న వసుదేవుడు అతి కష్టంమీద లేచి నుంచున్నాడు. ఎవరికోసమో వెదుకుతున్నట్టుగా తడుముకుంటూ ముందుకు వెళ్లి, పడబోయినాడు.

అంతలో బ్రహ్మ అక్కడకు వచ్చి అతణ్ణి ఆదుకున్నాడు. బ్రహ్మ దేవుని వెనుక దేవతలెందరో ఉన్నారు; వారి మధ్య నారదుడు కూడా ఉన్నాడు.

వసుదేవునకు అదంతా కలగా తోచింది. అతను నుంచున్నవాడు నుంచున్నట్టుగానే కరగిపోయి బ్రహ్మ పాదాలమీద వ్రాలాడు. బ్రహ్మ అతనిని గౌరవంతో లేవనెత్తాడు. ]

బ్రహ్మ: వసుదేవా! నీజన్మతరించింది. నీకూ మాకూ యావత్ప్రపంచానికీ కూడా త్వరలోనే ముక్తి లభించబోతోంది. జన్మరాహిత్యాన్ని పొందబోయే మీ దంపతులకు మా దేవలోకం ధన్యవాదా లర్పిస్తోంది.

వసుదేవుడు: ధన్యోస్మి! ధన్యోస్మి!!

నారదుడు: ...నారాయణ! నారాయణ!!

[ అంతలో ఉరుములు వినవచ్చినై. వసుదేవుడు కదలలేక కదలలేక యెలాగో లోపలకు వెళ్లాడు. బ్రహ్మాదులు అతనివంక సానుభూతితో చూస్తూ నుంచున్నారు. ]



## ★ 12. వ ర ం గ ం ★

[ అది దేవకీదేవి పురిటి గది. అందులో విష్ణుమూర్తి దేవకీదేవి ముందు నుంచుని ఉన్నాడు. ]

**దేవకీదేవి:**

"విలయకాలమందు విశ్వంబు నీపెద్ద
కడుపులోన దాచు కడిమి మేటి
నటుడ వీవు నేడు నాగర్భజుడ వౌట
పరమ పురుష వేడబంబు గాదె!"

ఈ దీనురాలిమీద యీ నాటికి దయకలిగిందా నాయనా! మా కష్టాలు తప్పించటానికే మా కడుపున పుట్టావా తండ్రీ! ఎంతటి సుదిన మిది! ఎంత అదృష్టం నాది!!

[ అంతవరకు తన్మయావస్థలో ఉన్న వసుదేవుడు భక్తిపారవశ్యంతో విష్ణుమూర్తిని సమీపించి, ఆయన పాదాలమీదపడ్డాడు. ]

**వసుదేవుడు:** శరణాగత వత్సలా!

"ఏ నిన్ను నిఖిల దర్శను
జ్ఞానానంద స్వరూపు సంతతు నపరా
ధీనుని మాయా దూరుని
సూనునిగా గంటి నిట్టి చోద్యము గలదే!"

**దేవకీదేవి:**

"నలినలోచన నీవు నిక్కము నాకు బుట్టెదవంచు నీ
ఖలుడు గంసుడు పెద్ద కాలము కార యింటనడంచె దు
ర్మలిన చిత్తుని నాజ్ఞ సేయుము మమ్ముగావుము భీతులౕ
నులుసు లేక ఫలించె నోచిన నోము లెల్లను నీవయై"

విష్ణువు: మీరు నన్నింతగా ప్రశంసించవలసిన పని లేదమ్మా! మీరేమీ సామాన్యులు కారు. నువ్వు మహాపతి వ్రతవు. ఈయన నీ భర్త అయిన ప్రజాపతి. సృష్టి ప్రారంభమైనప్పుడు బ్రహ్మ కోరిక ప్రకారం మీరు పన్నెండు వేల యేళ్లు ఘోరమైన తపస్సు చేశారు. అలా చేసి మీరు నన్ను సాక్షాత్కరింప చేసుకున్నారు. అప్పుడు నేను 'మీ కోరిక యేమిటి?' అని అడిగాను. "మేము నీకు తలిదండ్రులం కావాలని ఉంది" అని మీరు నాకు సమాధాన మిచ్చారు.

అదే మీకు వరమయింది. దాని ఫలితంగానే బృశ్ని గర్భుడు, వామనుడు అనే పేర్లతో యింతకుముందు మీకు నేను పుట్టాను. ఈ జన్మతో ఆ వరం పూర్తి అవుతుంది; మీకూ నాకూ కూడా ముక్తి లభిస్తుంది.

[ అదివిన్న దేవకీ వసుదేవులు అతనికి నమస్కరించి తలవాల్చుకుని నుంచున్నారు. ]

...వసుదేవా! ఇక నేను యీ రూపంలో యిక్కడ ఉండటం మీకూ నాకూ కూడా మంచిది కాదు. మాయను విడిచి, మోహాన్ని దూరం చేసుకుని నీ బాల్యస్నేహితుడైన నందుని యింట్లో నువ్వు నన్ను వదలి రావాలి. వింటున్నావా! అంతే కాదు. అక్కడ మహామాయ యశోదకు కూతురుగా పుట్టింది. నువ్వు ఆమె నిక్కడకు తీసుకురావాలి కూడా!

( దేవకీ దేవితో )

...అమ్మా...! అమ్మా...!!

[ అంతలో ఆ ప్రదేశమంతా పెనుచీకటిలో కప్పబడిపోయింది. అమ్మా! అమ్మా!! అని పిలుస్తూనే శ్రీమన్నారాయణుడు చిరు పాపడై నాడు; ఆమె ఒడిలో యిమిడిపోయినాడు. ఆ వెంటనే ఆకటి బాధతో అటమటించే పసిపాప మాదిరి యేడవటం మొదలు పెట్టాడు. ]

**వసుదేవుడు:** (అప్పుడే నిద్రనుంచి మేలుకున్నట్టుగా...)

బాబూ...బాబూ! ఏడవకు! ఏడవకు!!

[ అలా ఆడించటానికి ప్రయత్నిస్తూ వసుదేవుడు దేవకీ దేవిని సమీపించాడు. పాపకోసం చేతులు చాచాడు.

అంతలో సంకెళ్లు వాటంతట అవే విడి పోయినై. దేవకీ వసుదేవులు ఆశ్చర్య పడ్డారు. ]



## ★ 13. వ ర ం గ ం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...ఆ తరువాత ...వసుదేవుడు...

" బిడ్డని గరముల బ్రొమ్మున
నడ్డంబుగ బట్టి పదముఃలల్లన యిడుచుఁ గా
జడ్డన గావలి వారల
యొడ్డు గడచి పురటిసాల యొయ్యన వెడలెన్. "

" ఆ శౌరికి దెరువొసగె బ్ర
కాశోద్ధత తుంగ భంగ కలిత ధరాళా
కాశ యగు యమున మునుసీ
తేశునకు బయోధి త్రోవ యిచ్చిన భంగిన్. "

ఆ సమయాన, అక్కడ ...నందగోకులంలో...

" నందుని సతికి యశోదకు
బొందుగ హరి యోగమాయ పుట్టిన మాయా
స్పందమున నొక్క యెఱుగమి
క్రందుకొనియె నూరి వారి గావలి వారిన్. "

యమున దాటిన వసుదేవుడు మందచేరి నందగోపుని యింట్లో ప్రవేశించాడు. ఆవెంటనే శ్రీహరి చెప్పిన ప్రకారం తన కన్నారిని యశోద ప్రక్కన పడుకో పెట్టాడు. పొత్తిళ్లలో ఉన్న ఆమె కుమార్తెను మెల్లగా చేతుల్లోకి తీసుకున్నాడు; అక్కడి నుంచి కదిలాడు.

...అలా బయలుదేరిన వసుదేవుడు కనుమూసి తెరిచే లోపల తిరిగి కారాగారంలో ప్రవేశించాడు; ప్రవే

శించి, తాను తెచ్చిన పాపను తన భార్య ప్రక్కన ఉంచాడు.

అంతలో ఆ యినుప సంకెళ్లు అమాంతంగా వచ్చి అతనిని బంధించినై. తలుపులు వాటంతట అవే మూసుకునైౖ.

ఆ వెంటనే యోగమాయ గుక్కపట్టి యేడవటం మొదలు పెట్టింది.

అంతవరకూ మాయలోమునిగి గుఱ్ఱుకొడుతున్న కావలివాళ్లు ఆ యేడుపు విని లేచారు. లేచి...



## ★ 14. వ రం గం ★

[ కారాగారం ముందు కూర్చున్న కావలివాళ్లు కలవరంతో లేచారు. ]

**కావలిమనిషి:** 1.

...అరెరె...! అమ్మోరు కన్నట్టుందే!

2. ఆఁ ఆఁ...! అదుగో పాపయేడుపు!

1. ఊఁ...! అయితే పోయిరా! ఆలస్యం అయిందీ అంటే ఆ మారాజు మనమీద మండిపడతాడు.

2. జాగ్రత్తగా చూస్తూ ఉండు; యిప్పుడే వస్తా!

[ ఒక కావలివాడు కదలి వెళ్లాడు. రెండవవాడు లేచి తాళం లాగి చూశాడు. అది గట్టిగానే ఉన్నట్టు తేల్చుకుని పహరా తిరగటం ప్రారంభించాడు. ]



## ★ 15. వ రం గం ★

[ కంసుడు కలవరపడుతూ తన శయనాగారంలో తిరుగుతున్నాడు. అంతలో కావలివాడు అతణ్ణి సమీపించాడు. ]

**కావలివాడు:** ప్రభూ...! ...ప్రభూ...!! దేవకీదేవి నీళ్లాడింది ప్రభూ!!

**కంసుడు:** ఆఁ... ! ఎప్పుడు... ?

**కావలివాడు:** ఇప్పుడే ప్రభూ! అరనిమిషమైనా అయిందో లేదో! అంతే !

**కంసుడు:** ( అతిఉత్సాహంతో )

ఎవరక్కడ... ?

**భటుడు:** ( ముందుకు వచ్చి )

ఆజ్ఞ ; మహారాజా !

**కంసుడు:** ఏదీ...మా చంద్రహాసం... ?

[ ఆ ప్రక్కనే గోడకు వ్రేలాడుతున్న చంద్రహాసాన్ని తీసుకు వచ్చి భటుడు కంసునకు అందించాడు. కంసుడు దాన్ని అందుకుంటూ వికటంగా నవ్వాడు. ]

మా చంద్రహాసానికి మళ్లీ యీరోజు పండుగ కాబోలు !

[ ఆ మాట అంటూనే అతను ముందుకు సాగాడు. అతని వెనుకగా కావలివాడు వెళ్లాడు. ]



## ★ 16. వ రంగం ★

[ అది కారాగారం. యోగమాయను ఒళ్లో పెట్టుకుని దేవకీదేవి విచార పడుతోంది . ]

**దేవకీదేవి:** ...తల్లీ ! నిన్ను చూస్తుంటేనే నా గుండె జారి పోతోందమ్మా ! నీ బ్రతుకు తలచుకుంటేనే నాకడుపు తరుక్కుపోతోందమ్మా ! కంసుని ఖడ్గానికి యెఱ కావటానికే కారాగారంలో ప్రవేశించావా తల్లీ ? ...పుట్టగానే గిట్టడం అదృష్టమనుకోవాలో దుర దృష్టమనుకోవాలో నాకు తోచకుండా ఉందమ్మా ! ...అయ్యయ్యయ్యో ! ఈ చిట్టి తల్లిని ఆ కంసునికి యెలా ఒప్పగించేది ? ఈనెత్తురు గుడ్డును ఆ ఖడ్గానికి యెలా బలిచేసేది ?

**కంసుడు:** ( ప్రవేశించి, వికటాట్టహాసం చేస్తూ )
కంస సంహారానికి బయలుదేరి కారాగృహంలో చిక్కుకున్న శ్రీ హరి యెక్కడున్నాడు బావా ?

[ ఆమాట విని వసుదేవుడు ఉలిక్కిపడ్డాడు. ]

**దేవకీదేవి:** అన్నయ్యా... ! అప్పుడే వచ్చావా అన్నయ్యా ?

**కంసుడు:** ఔనమ్మా ! ఆలస్యంచేస్తే అల్లుడుగారు యేం చేస్తారో అని !

[ ఆమాట అంటూనే కంసుడు విరగబడినవ్వాడు . ]

**వసుదేవుడు:** ...పరాత్పరా ! మా బ్రతుకులు యింత పరిహాసం పాలు కావటానికి మే మేం పాపం చేశాం తండ్రీ ?

**కంసుడు:** ( వికటంగా నవ్వి )

పరాత్పరుడు ప్రార్థనలు వినే పరిస్థితిలో లేడు బావా;
కంస రాజేంద్రుని మీద కత్తిగట్టి కూర్చున్నాడు !

**వసుదేవుడు:** శ్రీహరి నంతగా చిన్న చూపు చూడటం శ్రేయస్కరం కాదు ; బావా !

[ కంసుడు తిరిగి వికటాట్టహాసం చేశాడు. ఒరనుంచి కత్తిని దూసి దేవకీదేవి వేపుగా అడుగులు వేశాడు. ]

**దేవకీదేవి:** అన్నయ్యా... ! ఏమిటీ అఘాయిత్యం ?

**కంసుడు:** అఘాయిత్య మేముందమ్మా ; ...అలవాటైన పనేగా ?

[ అంటూ చేతులు ముందుకు చాచాడు. ]

**దేవకీదేవి:** ( పాపను హృదయానికి హత్తుకుని, వెనుకడుగు వేస్తూ... )

...అల్లుడు కా దన్నయ్యా...యిది కోడలు !

**కంసుడు:** ( ఆగి, తిరిగి వికటంగా నవ్వి )

ఊఁ...! మామను చంపటానికి మగువ వేషం ధరించాడు కాబోలు ! ఐనా, యేదీ...యిలా యియ్యి !

[ పిల్లను దేవకి చేతులలోంచి లాక్కున్నాడు.

పిల్ల కెవ్వుమని కేక పెట్టింది. ]

**దేవకీదేవి:** అన్నయ్యా... ! ...అన్నయ్యా... ! !

[ కంసుడు తిరిగి వికటాట్టహాసం చేశాడు. ]

"అన్న శమింపు మన్న తగ దల్లుడుగా డిది మేనకోడలా
మన్ననసేయు మన్న విను మానిని జంపుట రాచపాడి గా
దన్న సుకీర్తివై మనగదన్న మహాత్ములు వోవు త్రోవ బో
వన్న భవత్సహోదరి గదన్న నినుణ్ శరణంబు వేడెదన్."

[ కంసుడు, 'అదేమీ పనికిరాద'న్నట్టుగా తల ఊపాడు. ]

"కట్టా యార్గురు కొడుకుల
బట్టి వధించితివి యాడుబడుచిది కోడల్
నెట్టన చంపగ వలెనే
కట్టిడివి గదన్న యన్న కరుణింపగదే !"

**కంసుడు:** ( గంభీరంగా )

దేవకీ... ! !

**దేవకీదేవి:** ...అన్నయ్యా!

"పుత్రుడు నీ బ్రతుకునకును
శత్రుండని వింటిగాన సమయింపదగున్
బుత్రులకు నోమ నేనియు
బుత్రీదానంబునేసి పుణ్యము గనవే!"

**కంసుడు:** (వికటంగా నవ్వి)

...ఆడుపడుచు...పుత్రీదానం...! ఊహుఁ...!
అసురాధిపతికి అర్థంకాని మాటలు!!
...అయినా...

(వసుదేవునితో)

...బావా! ఇది ఆడుపడుచు. ఈమెను అవమాన పరచటం అన్యాయం. అందుకనే...యిదుగో...ఆకాశానికి యెత్తేస్తున్నాను!

[ఆమాట అంటూనే కంసుడు ఆ చంటిపిల్ల కాలు పట్టుకుని గిరగిరా త్రిప్పి యెగరేశాడు. అది చూసిన దేవకీదేవి 'తల్లీ!' అంటూ ఒరిగిపోయింది.]

**వసుదేవుడు:** అయ్యయ్యో...క్రిందపడుతుంది బావా...!

**కంసుడు:** (వికటంగా నవ్వుతూ)

ఫరవాలేదు! ఏమీ ఫరవాలేదు! ఇదిగో...క్రింద పడకుండా కత్తిని అడ్డుపెట్టాను; చూశావా?

[ఆలా అంటూనే కంసుడు పైకి చూశాడు. అతని ముఖం అదో విధంగా మారిపోయింది.]

...అరెరె...! అదేమిటి...? ఆకాశంలోకి వెళ్లి పోతోందే! ఆశ్చర్యం...! ఆశ్చర్యం...!!

**వసుదేవుడు:** (చేతులు జోడించి పైకిచూస్తూ ...

...పరమేశ్వరా...! నీ లీలలు అగ్రాహ్యాలు తండ్రీ!

**యోగమాయ:** (పై నుంచి)

కంస రాక్షసా!

"తెంపరివై పొరింబొరిని దేవకి బిడ్డల జిన్ని కుఱ్ఱలం
జంపితి వంతనైన నుప శాంతి వహింపక బాలమీద నొ
ప్పించితి విస్సిరో యిదియు బీర మె నా సరసక జనించి నిక్క
జంపెడి వీరు డొక్క డెస సత్కృతి నొందెడువాడు దుర్మతీ!"

**కంసుడు:** ..ఆ...ఆ...!...మాయ...!...మహామాయ...!!

బావా... !...బావా... !!

**వసుదేవుడు:** ...కంసా!

**కంసుడు:**...చూశావా బావా?

**వసుదేవుడు:**...ఆ!

**కంసుడు:**...మాయ బావా!...మహామాయ!!

ఇదంతా శ్రీహరి చేసిందే!

(తిరిగి పైకి చూసి)

అరెరె...!...అదేమిటి? అలా మారిపోయిందేమిటి?

చూడు బావా...చూడు! ఎన్ని చేతులు? అబ్బ?

ఎన్ని ఆయుధాలు...?

అయ్యయ్యో...! వద్దు వద్దు...! వాటిని నా మీద

విసరద్దు... ! ...ఒద్దు తల్లీ...ఒద్దు!

[పైనుంచి వికటాట్టహాసం వినిపించింది.]

అయ్యో! ...శూలంతో పొడుస్తావా?

వద్దు...! వద్దు!! అమ్మాయ్...!

[కంసుడు భయంతో అరిచాడు. పైనుంచి వెట్టినవ్వు విని పించింది.]

**దేవకీదేవి:** (పలవరిస్తూ)

...తల్లీ...! చిట్టి తల్లీ ...!!

**వసుదేవుడు:** ( కంసుని శాంతింపచేయాలని ప్రయత్నిస్తూ... )
...బావా...! ఇటు చూడు! నా మాట విను! అదుగో ... మీ చెల్లెలు యిప్పుడిప్పుడే మూర్ఛ నుంచి తేరుకుంటోంది. అసలే గుండెచెదిరి ఉంది. నిన్నిలా చూస్తే ఆవిడ ప్రాణం అమాంతం యెగిరి పోదూ ?

**కంసుడు:** ( మనసును కొంచెం దిట్టపరచుకుని )
ఉఁహూఁ! ఇది మాయాకాదు...మోసమూ కాదు; నా అహంకారానికి శృంగభంగం. నే చేసిన పాపాలకు ప్రతీకారం. అంతే...! అంతే...!!

**దేవకీదేవి:** ...అన్నయ్యా...!

**కంసుడు:** తల్లీ! క్షమించమ్మా...నన్ను క్షమించు!!...నేను మీ కెంతో అపకారంచేశాను. మీ గుండెల్లో ఆరని మంట పెట్టాను. క్షమించు తల్లీ...! క్షమించానను! నన్ను క్షమించానను...!!

[ అంటూ పశ్చాత్తాపంతో దేవకీదేవి పాదాలమీద పడ్డాడు. ]

**దేవకీదేవి:** అన్నయ్యా...! ఏమి టిది...?

**కంసుడు:** ...అయ్యయ్యో...! ఎంత క్రూరంగా ప్రవర్తించాను! ఎంతటి పాపానికి ఒడిగట్టుకున్నాను!

"పాపుడ బాలఘాతకుడ బంధు విరక్తుడ దుష్టచిత్తుడం
గోపనుడం జరన్మృతుడ క్రూరుడ బ్రాహ్మణ హంత భంగి మీ
పాపల జంపితిం బయలి పల్కుల నమ్మితి సాధులార నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే!"

[ కంసుడు వసుదేవుని పాదాలమీద వ్రాలాడు.
వసుదేవుడు అతణ్ణి లేవదీశాడు. ]

**వసుదేవుడు:** విచారపడకు బావా...విచారపడకు!! ఇందులో నీ తప్పేముంది? ఏది యెలా కావాలో అలా అవుతుంది. ఎవరి విషయంలో అయినా అది అంతే!

**కంసుడు:** అలా కాదు బావా! నే నెన్నో పాపాలు చేశాను. వాటికి పరిహార మంటూ లేదు.

**వసుదేవుడు:** శాంతించు బావా...శాంతించు! ఎంతటి పాపానికైనా పశ్చాత్తాపమే తగిన ప్రాయశ్చిత్తం. అది నీకు కలగనే కలిగింది. ఇక నువ్వు బాధపడటం దేనికి? అదీ కాక...

"పగతుర జెఱిచితి ననియును
బగతురచే జెడితి ననియు బాలుడు తలచుం
బగ సెలుములు లే వాత్మకు
బగ సెలుముల కీలు కర్మబంధము *కాదే"

**దేవకీదేవి:** అంతే అన్నయ్యా...ముమ్మాటికీ అంతే! నువ్వు బాధపడవలసింది యిందులో యేమీ లేదు!

[ కంసుడు 'అమ్మాయ్ ..!' అంటూ తిరిగి ఆవిడ పాదాలకు చుట్టేసుకున్నాడు. ఆవిడ అతణ్ణి సానుభూతితో చూస్తూ లేవదీయబోయింది. ]



# ★ 17. వ రంగం ★

[ కథకుడు ఆతరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ...అదే సమయానికి అక్కడ నందగోకులంలో అందరూ ఆనందంలో మునిగి తేలుతున్నారు. యశోదా దేవి ఒక నల్లనయ్యను కన్నదని మంద అంతటా మారుమ్రోగిపోయింది. అప్పుడు...

"దుందుభులు మొరసె గాయక
సందోహము వాడె సూత సముదాయముతో
వంది జనులు కీర్తించిరి
క్రందుగ వీతెంచె భద్ర కాహళరవముల్"

"పల్లవ తోరణ రాంగిక
వల్లీ ధ్వజ లాజ ధూప వాసనములతో
సల్లలితములై యొప్పెను
వల్లవ వల్లభుల యిండ్ల వాకిండ్లెల్లన్"

"పసుపులు నూనెలు నలదిన
బస దనరి సువర్ణ బర్హి బర్హ ప్రభతో
బసిమి గలిగి వెలుగొందుచు
బసులన్నియు మందలందు బ్రసరించె *నహో"

"క్రేళ్లుఱికి మసలె లేగలు
మల్లడిగొని అంకెలిడియె మదవృషభంబుల్
వెల్లుగ మొదవుల పొదుగుల
జల్లించెం బాలు బాలు సంభవ వేళన్"

[ ఆ సమయాన మందలో ఉన్న ముత్తయిదువులందరూ నందుని యింట్లో గుమిగూడారు. ]



## ★ 18. వరంగం ★

[ అది నందుని యిల్లు. ఆ యింటి సావిట్లో ఒక బంగారపు తొట్టె
ఊగులాడుతోంది. అందులో నల్లనయ్య పడుకుని ఉన్నాడు.
అక్కడ చేరిన ముత్తయిదువ లందరూ పోటీలు పడి ఆ తొట్టెను
ఊగిస్తున్నారు.
తొట్టెలో ఉన్న నల్లనయ్య వారివంక చూస్తూ కిలకిల్లాడు
తున్నాడు. అది గ్రహించిన ముత్తయిదువులుఆశ్చర్యపోతున్నారు.]

**ముత్తయిదువులు:**

"జోజో కమల దళేక్షణ
జోజో మృగరాజ మధ్య జోజో కృష్ణా
జోజో పల్లవ కర పద
జోజో పూర్ణేందు వదన జోజో *జోజో"



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. పూతన
3. కంసుడు
4. బాణుడు
5. వసుదేవుడు
6. నందుడు
7. యశోద
8. రోహిణి

# పూతన సంహారం

## ★ 1. వ ర ం గ ం ★

[ అది వసుదేవుడూ దేవకీ కాపురం ఉన్న కారాగారం.
అక్కడ నందుడూ వసుదేవుడూ ముచ్చటించు కుంటున్నారు.
వసుదేవుడు సంకెళ్లలో ఉన్నాడు. ]

**వసుదేవుడు:** ...నందా! నిజంగా యీరోజు పండువులా ఉంది. ఈ జీవితంలో మళ్లీ మనం యిలా కలుసుకుంటా మనుకోలేదు. ఎంత అదృష్టం... ?

"పొడగంటి నిన్ను బ్రదికితి
గడచితి నాపదల నింక గార్యంబుల నే
యెడ మడుగు లేని నెచ్చెలి
బొడగాంచుట చచ్చి మరల బుట్టుట గాదే!"

...ఇంతకూ మన గోకులం యెలా ఉంది? మన వాళ్లందరూ కులాసాగా ఉన్నారా ?

"పలురోగంబుల నొంద కున్న వె పసుల్
పాలిచ్చునే ధేనువుల్
గొలకుల్ వాగులు వారి పూరితములే
గోష్ఠ ప్రదేశంబులం
బులులున్ దుష్టులు సంచరింపవుగదా
పొల్పారునే ఘోషముల్
కలవే పచ్చని పూరిజొంపములు
తత్కాంతార భాగంబులన్"

**నందుడు:** ఆహా! అంతా సక్రమంగానే ఉంది. అయితే మాత్రం ఆనందమేముంది? మా ప్రాణానికి ప్రాణం కారాగా

గంలో కష్టపడుతూ ఉంటే మాకు మనశ్శాంతి యెలా ఉంటుంది ? మిమ్మల్ని తలచుకుని, మీ అగచాట్లు అర్థంచేసుకుని మేం విచారపడని రోజంటూ ఉందా ? ఊఁహూ ! ఎటువంటివాళ్లకు యెటువంటి కష్టం వచ్చింది ?

**వసుదేవుడు:** ...ఎవరి కర్మలో యెలా ఉంటే అలా నడుస్తుంది; దానికి యితరులు బాధపడి మాత్రం యేం చేస్తారు ?

**నందుడు:** అది నిజమే ! అయినా మనసు ఊరుకుంటుందా ? అందులోనూ ఆ బాల్యమిత్రుడు అగచాట్లు పడుతూ ఉంటే అన్నం నీళ్లూ సయిస్తయ్యా ?

**వసుదేవుడు:** ( సానుభూతితో )

ఊఁహూ ! అభిమానమనేది అలాగే బాధపెడుతుంది. అదే కాకపోతే నువ్విలా కృంగిపోవలసిన పనేముంది ?

"సంతతి లేదనియెడు ఘన
చింతనముల నరసి ముదిమి జిక్కిన నీకుఁ
సంతతి కలిగెను ; ......"

[ ఆమాట అంటూఉండగానే అతనికేదో గుర్తుకువచ్చింది. అందుకే కొంచెం బాధపడ్డాడు ; తలవాల్చుకున్నాడు. ]

**నందుడు:** అదొకటే, మా కీమధ్య కలిగిన అదృష్టం !

**వసుదేవుడు:** ( తిరిగి ఉత్సాహం తెచ్చుకుని )

అది విని దేవకీ నేనూ యెంతో సంతోషించాం. కాని, అక్కడికి వచ్చి మీ అందరి ఆనందంలోనూ పాలుపంచుకునే అదృష్టంమాత్రం మాకు లేక పోయింది.

...అయినా...అడగటం మరచాను....; ఆ చిరంజీవి యెలా ఉన్నాడు ?

నందుడు: కులాసాగానే ఉన్నాడు. ఆయనే యిప్పుడు మా కళ్లకు వెలుగు; మా మందకు ప్రాణం. ఆయన సేవలోనే మేమూ మన గోకులమూ కష్టాలుమరచి కాలం గడుపుతున్నాం.

వసుదేవుడు: ...మంచిమాట చెప్పావు ; నందా !

[ ఆ మాట అంటున్న వసుదేవుని కళ్లు చెమ్మగిలినై. నందుడు అది గ్రహించాడు. ]

నందుడు: ...వసుదేవా...! ఏమిటీ అజ్ఞానం ?

వసుదేవుడు: అఁహాఁహాఁ...ఏమీ లేదు ! సంతానాన్ని తలుచుకుంటే కలిగే సంతోషం కొద్దిగా అనుభవంలోకి వచ్చింది ; అంతే !

నందుడు: ( సానుభూతితో )

...చూడు...!

"నీకుఁ దేవకికిఁ జనించిన సుతానీకంబు దోడ్తోడ ము
న్నీ కంసుండు వధించె, మీసుత దుదిఁ హింసింప జేదప్పి తా
నాకాశంబున కేగె బాలయది దైవాధీన మాపద్దశఁ
శోకంబందు నెతజ్ఞు డూఱడుము నాసూనుండె నీసూనుడున్"

వసుదేవుడు: ( అమితమైన ఆనందంతో )

అలా అనుకునే బ్రదుకుతున్నాం !

నందుడు: ఊఁ...! వెళ్లిరానా ?

[ లేచి వసుదేవునకు నమస్కరించాడు. ]

వసుదేవుడు: ...నందా...ఓమాట ! ఆ చిరంజీవి విషయంలో యేమరుపాటన్నది యేమాత్రం పనికిరాదు. అతణ్ణి మీరు కంటిని రెప్పమాదిరి కాపాడుకోవాలి ! వింటున్నావా ?

నందుడు: ( చిరునవ్వుతో )

...ఆఁ...! తప్పకుండాను !

వసుదేవుడు: (గంభీరంగా)

మరోమాట! అక్కడేదో అపాయం జరుగబోతోం దని యెందుకో నామనసు చెబుతోంది. అయినా భయపడాల్సిన పనేమీ లేదు; ధైర్యంగా ఉండు! సుఖంగా వెళ్లిరా!!

[ఆ మాట విని, నందుడు కొంచెం కలవరపడ్డాడు. వదలలేక వదలలేక వసుదేవుని వదలి వెళ్లాడు. అతను కనుచూపు మేర దాటే వరకు వసుదేవుడు అతణ్ణి చూస్తూనే ఉన్నాడు; అతని కళ్లలో నీళ్లు తిరిగినై.]



## ★ 2. వ ర ం గ ం ★

[ కంసుడు తన ఆలోచనా మందిరంలో ఆటూ యిటూ పచార్లు చేస్తున్నాడు. అతనిలో ఉన్న ఆందోళన గ్రహించి అతని స్నేహితులు, బాణుడూ భౌముడూ కూడా, భయపడి పోతున్నారు. ]

**కంసుడు:** ఉహుఁ! మాయతోపాటు పుట్టాడుట...మన మధ్యనే పెరుగుతున్నాడుట! ఎక్కడున్నాడో యేమో...?

**బాణుడు:** మహారాజా! ఎక్కడున్నా సరే యిట్టే పసిపడతాం; యెందుకు యింతగా బాధపడతారు ?

**కంసుడు:** ( వికటంగా నవ్వి )

భ్రమ... బాణా...! నీది ఉట్టి భ్రమ! అతణ్ణి పోల్చుకోవటం అసంభవం. కోటాను కోట్లుగా ఉన్న పసిపాపల్లో అతణ్ణి గుర్తు పట్టడం అంత సులభ మనుకుంటున్నావా ?

**భౌముడు:** ఉహూఁ అలాగా... ?

"అట్టయిన తడవనేటికి
బట్టణముల మందలందు బల్లెల నెల్లం
బుట్టెడి పెరిగెడి శిశువుల
బట్టి వధించెదము మమ్ము బంపు మధీశా !"

**బాణుడు:** నాకు మరో సందేహం కూడా కలుగుతోంది. అతను పసిపాపడుగానే పుట్టినా మంత్రాలూ తంత్రాలూ ఉపయోగించి, మారువేషం ధరించి యీ పాటికి మనంతవాడుగానూ మారిపోయి ఉండవచ్చు; ఏమంటారు ?

**కంసుడు:** అదీ అసంభవం కాదు.

**భౌముడు:** కాని, అసలు అతడు ఉంటే యెక్కడ ఉంటాడూ అని... !

**భాణుడు:** అతనికి 'యిక్కడ', 'అక్కడ' అని యేముంది ? ఎక్కడ పడితే అక్కడే ఉంటాడు !

**భామడు:** అంటే... ?

**భాణుడు:** శాంతం, సత్యం, దయా, ధర్మం అన్నవి యెక్కడ యెక్కువగా ఉంటే అక్కడల్లా ఆయన ఉంటాడన్న మాట! జ్ఞానులూ, గోవులూ నిజంగా అతని స్వరూపాలనే చెప్పాలి. యజ్ఞయాగాదులు అతనికి ఆటపట్లు. అందుకనే మనం జ్ఞానులనూ గోవులనూ చంపెయ్యాలి; యజ్ఞయాగాదులు జరగకుండా చూడాలి. దాంతో అతను నామరూపాలు లేకుండా పోతాడు.

**కంసుడు:** ( సంతృప్తితో )

...అదీ విషయం. ఆ ఆలోచన అద్భుతంగా ఉంది.

**భాణుడు:** ఇంత పనీచేసి దేవతలను వదిలిపెడితే లాభం లేదు. వాళ్లను పట్టుకోవాలి, బంధించాలి, చిత్రవధ చెయ్యాలి; అప్పుడుగాని 'హరి' అనేవాడు లేకుండా పోడు.

**కంసుడు:** ( ఉత్సాహంతో )

సెబాస్...బాణా... సెబాస్ !!

**భాణుడు:** ఇక, మహారాజులు 'ఊఁ !' అంటే చాలు మా ప్రతాపాన్ని ప్రదర్శిస్తాం.

**కంసుడు:** శుభస్య శీఘ్రం అన్నారు; వెళ్లిరండి !

**భాణుడు** ) కంస రాజేంద్రునకూ జై !
**భామడు** ) రాక్షస వంశోద్ధారకునకూ జై !!



## ★ 3. వరంగం ★

[ అశోక ఆశ్రమం. అందులో ఒక మునీశ్వరుడు విష్ణుదేవుని గూర్చి ప్రార్థన చేసుకుంటున్నాడు. ]

**ముని:**

"నగు మొగమున్ సుమధ్యమును నల్లని మేనును లచ్చి కాట ప
ట్టగు నురమున్ మహాభుజము లంచిత కుండల కర్ణముల్ మదే
భగతియు నీలవేణియు గృపారస దృష్టియు గల్గు వెన్ను డి
మ్ముగ బొడ జూపుగాత కనుమూసిన యప్పుడు విచ్చినప్పుడున్"

[ ఆ దేవసమయానికి కొందరు రాక్షసులు అక్కడకు వచ్చారు; వచ్చి, ఆ మునివంక ఎగాదిగా చూశారు; వికటాట్టహాసం చేశారు. ఆ ముని అది గ్రహించే స్థితిలో లేడు. ]

" దివిజ రిపు విదారీ దేవలోకోపకారీ
భువనభరనివారీ పుణ్యరక్షానుసారీ
ప్రవిమల బుధ మూర్తీ బంధుపోష ప్రవర్తీ
ధవళ బహుళ కీర్తీ ధర్మ నిత్యానువర్తీ "

[ అలా ధ్యానంలో ఉండగానే రాక్షసులు ఆయనను సమీపించి తాళ్లతో బిగించి కట్టేశారు. ఆతరువాత ఆయన కళ్లు తెరచి వాళ్లవంక చూశాడు; మందహాసం చేశాడు. ]

... పరమేశ్వరా! ఈ నాటికి నీకు నామీద దయ కలిగిందా నాయనా! ఈ రూపంలో నాకు ముక్తిని ప్రసాదిస్తున్నావా తండ్రీ! పరమదయాళూ! పరాత్పరా ...!

[ ఆ ముని వారికి, సంతోషంతో నమస్కరించాడు. అతణ్ణి చూసి వాళ్లు వికటంగా నవ్వుకున్నారు. ]

భీముడు: ... ఊఁ!... ఈడ్చుకు వెళ్లి ఆ హోమగుండంలో పడేయండి; వాడి పీడా మన పీడా కూడా విరగడై పోతుంది!

[ అంతలో లోపలనుంచి పిల్లల యేడుపులూ పెద్దల హాహా కారాలూ, వాటితో పాటు రాక్షసుల వికటాట్టహాసాలూ వినిపించినై. ]



## ★ 4. వరంగం ★

[ గోకులంలో కొందరు ముత్తయిదువులు నందుని యింటికి కానుకలు తీసుకు వెడుతున్నారు. ]

ముత్తయిదువు. 1. ...ఉండటానికి నల్లగా ఉన్నా మొహంలో ఆ వెలుగు చూశావ్ !

2. అదేనా... ? ఆ చూపులు అమృతాన్ని కురవటంలా ?

1. ఏమైనా, అతను మామూలు పిల్లవాడు మాత్రం కాదు !

3. ఊహుఁ ! ఇంకా సందేహమా ?

2. నిజంగా ... అదృష్టమంటే అదృష్టం ఆ తల్లిది !

1. తప్పకుండాను !

3. అతనికోసం ఆవిడ యెన్నిజన్మలు తపస్సు చేసిందో ?

2. ఏమీ చెయ్యకపోతేనే ఆ వయసులో అటు వంటి బంగారపు బొమ్మ పుడతాడా ?

2. మంచిమాట అన్నావ్ ! ఇంతకూ అదివాళ్ల అదృష్టమే కాదు ; మన అందరిదీ కూడాను. కనిపెంచేభాగ్యం వాళ్లదయితే కళ్లారా చూసే భాగ్యం మనది.

1. అంతేనమ్మా ! ముమ్మాటికీ అంతే !

[ అక్కడే ఓ ప్రక్కగా ఉన్న పూతన వాళ్లమాటలు విని 'ఆఁ...దొరికాడురా !' అన్నట్టు తల ఆడించింది. ఆవెంటనే అది తనరూపాన్ని మార్చుకుని అప్సరస మాదిరి తయారయింది ; గబగబా వాళ్లవెనుక వెళ్లింది. ]

పూతన: ... అమ్మా...! అమ్మా...!! మిమ్మల్నే...!!

[ ముత్తయిదువు లందరూ వెనక్కు తిరిగి చూశారు. ]

ముత్తయిదువు: 1. ... ఎవరది...?

2. ... ఎవరికోస మమ్మా?

[ పూతన వాళ్లను సమీపించింది. ]

3. ... అబ్బ! ఎవరోగాని, అచ్చంగా లక్ష్మీ దేవల్లే ఉంది!

పూతన: ... చూడండి...! మీరు......

ముత్తయిదువు: 1. ... గోపికలం! మీకు ఎవరు కావాలి?

పూతన: ( లజ్జిస్తున్నట్టు నటిస్తూ )
... నాకు... నాకు...

[ ముత్తయిదువులు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]

ముత్తయిదువు: 3. ...నల్లనయ్యను చూడాలని వచ్చిందో యేమో?

2. అంతే అయి ఉంటుంది!

పూతన: ( అమితమైన ఉత్సాహంతో )
... ఆఁ ఆఁ...! అదే అదే...!!

ముత్తయిదువు: 3. దానికింత సందేహం దేనికి? మాతోరండి, మేమూ అక్కడికే వెడుతున్నాం.

పూతన: ( చెమ్మగిల్లిన కళ్లతో... )
అమ్మయ్య! బ్రతికించారమ్మా!
[ ముత్తయిదువులు ఆమెవంక సానుభూతితో చూశారు. ]
... చూడండమ్మా! తెలియక అడుగుతున్నాను;...మనం యింతమందిమి వెడితే...

ముత్తయిదువు: 2. ... ఆ తల్లి యేమన్నా అనుకుంటుం దేమో అని...! అంతేనా?

పూతన: ఆఁ ఆఁ...అంతే!

ముత్తయిదువు: 3. ఇందులో అనుకోవటానికేముందమ్మా? అసలు, యిప్పుడాయిల్లు యిల్లు కాదుగా; పుణ్యక్షేత్రం; ఎక్కడెక్కడి వాళ్లూ తీర్థ ప్రజమాదిరి వచ్చిపోతున్నారు!

పూతన: అబ్బ! ఎంత విశేషమమ్మా...! ఇంతకూ... ఆ అబ్బాయి పేరు...

ముత్తయిదువు: 3. కృష్ణయ్య!

పూతన: ఆహాహా...! ఏం పేరమ్మా! ఎంత బాగుంది! ...కృష్ణయ్య! కృష్ణయ్య...!! కృష్ణయ్య...!!!

[ తన్మయత్వాన్ని నటించసాగింది. ]

ముత్తయిదువు: 2. చూశావా అక్కయ్యా; ఆ పేరు వినగానే ఆవిడ...

1. ఆఁ ఆఁ! అదేమిటి...అలా ఆడుతోంది?

4. ...మన కృష్ణయ్య మహానుభావుడనుకుందో యేమో?

3. (హేళనగా)
పోనీ, నువ్వైనా కాదని చెప్పకూడదూ?

2. (వికటంగా)
ఇదీ నేనూ చెబితే మాత్రం వినే దెవరు?
విన్నా...నమ్మే దెవరు?

[ అందరూ పకపక లాడారు. ]

పూతన: ( వాళ్లమాటలు వింటూనే... )
...కృష్ణా...! .. కృష్ణా...!
"హరే రామ హరే రామ
రామ రామ హరే హరే

హారే కృష్ణ హారే కృష్ణ
కృష్ణ కృష్ణ హారే హారే!!"

[ అలా అంటూ నృత్యం చేయసాగింది. ]

**ముత్తయిదువు:** 1. అదుగో... చూస్తున్నావా?

2. ఊс...! నారాయణుడూ నల్లనయ్యా ఒకరే అన్న మాట!

3. కాదేమో అనుకుంటే కళ్లు పోతై కూడాను!

5. ఉహుс! 'భక్తి' అంటే అలా ఉండాలి! మనమూ ఉన్నాం...యేం లాభం?

**పూతన:** ( ఓరగా అప్పుడప్పుడు వాళ్లవంక చూస్తూ... )
"హారే కృష్ణ హారే కృష్ణా
కృష్ణ కృష్ణ హారే హారే "

[ అలా ఒళ్లు తెలియనట్టు నటిస్తూ వాళ్లననుసరించి వెళ్లింది. ]



## ★ 5. వ ర ం గ ం ★

[ అది నందుని యిల్లు. అక్కడ ఒక తొట్టెలో నల్లనయ్య నిదుర పోతున్నాడు. ఒక గోపిక ఆ తొట్టెను మెల్లగా ఊపుతోంది. ]

గోపిక: నిదురపో నా తండ్రి నిదురపోవయ్యా

అదురు బెదురూ లేక ; అయ్య ! కృష్ణయ్యా !!!

ఊఁ...ఊఁ... !!

[ అంతలో కొందరు ముత్తయిదువులు అక్కడకు వచ్చారు. వారితోపాటు పూతన కూడా ఉంది. ఆవిడ సరాసరి ఉయ్యాల దగ్గరకే వెళ్లింది.

పూతన సమీపించగానే, అంతవరకు నిద్దుర పోతున్న కృష్ణయ్య కెవ్వున కేక పెట్టి కళ్లు తెరిచాడు ; యేడవటం మొదలు పెట్టాడు. అది చూసి అక్కడున్న వాళ్లందరూ అదలి పోయినారు.

అది అదనుగా తీసుకుని, పూతన, తొట్టెలో ఉన్న కృష్ణయ్యను చేపున యెత్తుకుంది; 'ఓ...ఓ...ఓ... !' అంటూ అతణ్ణి ఆడించటం మొదలుపెట్టింది. ]

పూతన: కృష్ణా...! కృష్ణా...! నా తండ్రీ...! ఎంత కాలానికి కనబడ్డావు నాయనా...! కృష్ణా...! కృష్ణా...! కన్నారీ... !!

[ ఆ మాటలు విన్న కృష్ణయ్య చిరునవ్వులు చిందాడు. అక్కడున్న గోపికలందరూ పూతన వంక ఆశ్చర్యంతో చూశారు. ]

...నా చిట్టి తండ్రీ ! నా బంగారు బాబూ...!! ఈ రోజు యెప్పుడు వస్తుందా అని...! యీ కళ్లకు యెప్పుడు కనబడతావా అని యెన్నాళ్ల నుంచీ యెదురు చూస్తున్నానో తెలుసా ? ఆహాహాహా ! కృష్ణా ! కృష్ణా ! నా తండ్రీ !!

[ అంటూ కృష్ణయ్యను హృదయానికి హత్తుకుంది. కృష్ణయ్య ఆ మాటలు వింటూ ఆమె మెళ్లో ఉన్న నగలతో ఆడుకో సాగాడు. ]

...ఏమిటీ ఆటలు...?...ఏమిటీ ఆనందం...? ఓ...
అదా సంగతి? పాలు కావాలా బాబూ...పాలు
కావాలా...?

[ అలా అంటూ పూతన సంతృప్తితో నవ్వింది. ]

ఉహుఁహుఁ! నువ్వు చెప్పకపోతే నా కెలా
తెలుస్తుంది?

[ ఆమాట అంటూనే కృష్ణయ్యకు పాలుపట్టే ప్రయత్నంలో
పూతన ఓ ప్రక్కకు వెళ్లింది.
అది చూసిన ముత్తయిదువు లందరూ ఆశ్చర్యంతో ఆమె వంకనే
చూస్తూ నిలబడిపోయినారు. ]

"నా చనుబాలు లోక గ్రుక్కెం
డో చిన్నికుమార త్రావు మొయ్యన పిదపన్
నీ చెలువ మెఱుగ వచ్చును
నా చెలువము సఫలమగును నలిన దళాక్షా!"

[ ఆ మాటలు విన్న కృష్ణయ్య పాలుత్రాగటానికి తొందర కనబర
చాడు.
అంతలో రోహిణి అక్కడకు వచ్చింది. వచ్చి, ఆ పరిస్థితి చూసి
నివ్వెర పోయింది. ]

రోహిణి: ( ముత్తయిదువుల నుద్దేశించి... )
...ఏమిటమ్మా యిది? ఎవరీవిడ...?

ముత్తయిదువు: 1. ఎవరో మాకూ తెలియదు; నల్లనయ్యను
చూడాలని వచ్చింది!

రోహిణి: వస్తేవచ్చింది...యెవరు వద్దన్నారు? కాని, యిదేంపని?
( పూతనతో )
...చూడమ్మా...చూడు...! ఇప్పుడే కడుపునిండా
పాలు పట్టి పడుకోబెట్టాం! ఇలా మాటిమాటికీ
యిస్తే యెలా? ...... ఏదీ ...... అబ్బాయి
నిలా యియ్యి...!

[ రోహిణి కృష్ణయ్యను తీసుకోవటానికి ప్రయత్నించింది. ఆ పని తనకు యిష్టం లేనట్టు కృష్ణయ్య యేడువ సాగాడు. అది చూసి రోహిణి ఆశ్చర్యపోయింది; అతణ్ణి పూతన చేతుల్లోనే వదిలేసింది.]

పూతన: ( కృష్ణయ్యను ఆడిస్తూ... )

...ఓ...ఓ...ఓ...ఓ...! ఏడవకు బాబూ... యేడవకు ; ఇవ్వనుగా...ఆవిడ కివ్వనుగా ...! ఆవిడకే అనేమిటి యిక యెవ్వరికీ యివ్వను ! ఊఁ... యేడవకు !!

[ పూతన మాటలు విన్న కృష్ణయ్య యేడుపు మానాడు. రోహిణికి అదంతా విచిత్రంగా తోచింది. అంతేకాదు ; అవిడ, తన కది అవమానంగా కూడా భావించింది. అందుకనే పూతన వంక చురచురా చూసింది. ]

...అదేమిటమ్మా! అలా చూస్తా వేమిటి? నేనేం చేశాను? ... పిల్లవాణ్ణి చూడటం తప్పా? ఆడించటం అన్యాయమా? పాలిమ్మని అడిగితే యివ్వటం దోసమా? ఉఁహూఁ!...కని పెంచే తల్లులే యిలా అనుకుంటే గొడ్రాళ్ళ మాట చెప్పే దేముంది?

[ అలా అంటూనే పూతన కన్నీళ్లు పెట్టుకుంది.

అంతలో యశోద లోపలినుంచి వచ్చింది; పూతన అన్న మాటలు విన్నది; ఆమె వంక సానుభూతితో చూసింది. ]

యశోద: ( రోహిణితో )

పోనీ వదినా ... ఆవిడ మనసు అంతగా కష్టపెట్టడం దేనికి ?

రోహిణి: ఊఁ... సరే! నీకే అభ్యంతరం లేకపోతే నాదే ముంది?

[ పూతన యశోదవంక కృతజ్ఞతతో చూస్తూనే కృష్ణయ్యకు పాలు కుడుపుతోంది.

కృష్ణయ్య కేరింతలు కొడుతూ గుటుకు గుటుకున పాలు త్రాగటం మొదలు పెట్టాడు.

అలా ఒకక్షణకాలం గడిచిందో లేదో, అంతలోనే పూతనలో కలవరం ప్రారంభమయింది. ఆమెలో ఉన్న జీవకళ క్రమ క్రమంగా క్షీణించి పోసాగింది. ]

పూతన: ( భయంతో )

...అయ్యయ్యో...యిదేమిటి... ?

[ అని బాధపడుతూ, పూతన కృష్ణయ్య వంక చూసింది. కృష్ణయ్య తన పని తాను చేసుకుంటూనే ఆమె కళ్లల్లోకి చూస్తూ ముసి ముసి నవ్వులు నవ్వాడు. ]

అయ్యో...అయ్యో!! పాలు తాగమంటే ప్రాణాలు తాగేస్తున్నాడే...! ...అమ్మ బాబోయ్!!

[ అంటూ కృష్ణయ్యను క్రింద పడేయాలని చూసింది. అతణ్ణి తనకు దూరంగా త్రోసి పారేయటానికి యెంతగానో ప్రయత్నించింది. కాని, ఆమె కదేమీ సాధ్యం కాలేదు.

ఆ వెంటనే ఆమె గావుకేకలు పెట్టింది. ఆ కేకలు విన్న గోపికలందరూ ఆశ్చర్య పోయినారు.

కృష్ణయ్యను వదిలించుకోవటానికి పూతన చేసిన ప్రయత్నం యింతా అంతా కాదు. అది తన బలాన్నంతనీ ఉపయోగించింది; కాని కృష్ణయ్య తన చిట్టిచేతులతో దాని మెడను చుట్టేసుకున్నాడు; దానికి వీలున్నంత దగ్గరగా జరిగాడు; గబగబా పాలు త్రాగసాగాడు.

అంతలో పూతన 'కృష్ణా! కృష్ణా...! కృష్ణా! అని యెంతో బాధతో అరిచింది. అరవటమే కాదు; ఒరిగిపోయింది కూడా.

పూతన అలా ఒరిగిపోగానే ఒక కొండ కూలినంత మ్రోత అయింది. అది విన్న గోపికలు నివ్వెరపడ్డారు.

అంతలో పూతనకు తిరిగి రాక్షసి రూపం వచ్చింది. అది చూసిన గోపికలు భయపడ్డారు; 'కృష్ణా; కృష్ణా!' అంటూ మూర్ఛ పోయినారు.

అప్పు డక్కడ కొంచెం గుండె నిబ్బరంతో ఉన్నదల్లా, యశోదా రోహిణీ మాత్రమే. వాళ్లు కూడా అమితమైన ఆశ్చర్యంతో ఒకరివంక ఒకరు చూసుకున్నారు.

అంతలో కృష్ణయ్య పూతన రొమ్ముల మీదకు ప్రాకి ఆమె శరీర మంతా హూనాహూనం అయేటట్టు పిడిగ్రుద్దులు గుద్దాడు. ఆ బాధ భరించలేక పూతన భీకరంగా అరిచింది; అరిచి అరిచి ప్రాణం వదిలింది.

ఆ తరువాత, యశోద కృష్ణయ్యను చేతుల్లోకి తీసుకుంటూ ఉండగా, నందుడు లోపలకు వచ్చాడు. అతనితో పాటు కొందరు గోపాలురు కూడా ఉన్నారు. వాళ్లందరూ అక్కడ పడి ఉన్న పూతనను చూశారు; చూసి, భయంతో కంపించి పోయినారు. నందుడు మాత్రం చిరునవ్వుతో తల పంకించాడు. ]

**నందుడు:** ఉహుఁ! వసుదేవునికి యింత దూరదృష్టి ఉందన్న మాట!

**యశోద:** అదేమిటి?

**నందుడు:** ఏముంది? ఇక్కడ యిలా యేదో జరుగబోతోందని అతను చెప్పనే చెప్పాడు.

**యశోద:** ( రోహిణితో )

ఊఁ...! రా వదినా...రా; పిల్లవాడికి కాస్త దిష్టి తీద్దువు గాని!

**గోపకులు:** ( భక్తితో )

కృష్ణయ్యా! నువ్వు పిల్లవాడివా నాయనా? కాదు.

ముమ్మాటికీ కాదు. మమ్మల్ని ఉద్ధరించటానికి పుట్టిన మహానుభావుడివి! ... కృష్ణా... ! ...కృష్ణా...!

ఉపనందుడు:

.

ఊఁ... ! చూస్తారేం... ; లాగెయ్యండి...! దీన్ని ...బయటికి లాగెయ్యండి !

గోపకులు: అమ్మ బాబోయ్ ; ఇలా ఉన్న పాళంగానా ?

ఒకవృద్ధుడు: తెండిరా...; గొడ్డళ్లు తెండి ! ఊఁ... !!

[ గోపకు లందరూ కదిలారు. యశోదా రోహిణీ నందుడూ లోపలకు వెళ్లారు. ]



## ★ 6. వ ర ం గ ం ★

[ స్మశానంలో ఒక చోట పూతన శరీరం కాలుతోంది. ఆ మంటలు ఆకాశాన్ని అంటుకుంటున్నై; ఆచుట్టు ప్రక్కల అంతటా మంచి వెలుగును వెదజల్లుతున్నై.
గోపకులు గుంపులు గుంపులుగా, ఆచుట్టు ప్రక్కల నుంచు న్నారు. అందరిలోనూ అదోవిధమైన ఆశ్చర్యం కనబడు తోంది. ]

గోపకుడు: 1. ... చూశావా మామా...; కర్పూరంలా కాలిపోతోంది!

2. ఉహుఁ! కర్పూరానికైనా యింత కమ్మదనం ఉంటుందా అని...!

3. అదే విచిత్రంగా ఉంది.

4. ... విచిత్రం అందులో లేదయ్యా; అసలు దాని చావులోనే ఉంది. అది రాక్షసిగా పుట్టినా చచ్చి స్వర్గానికే వెళ్లింది; విచిత్రమంటే విచిత్రం అదీ!

5. అంతే అంతే! కాకపోతే యీ సువాసన యేమి టనుకున్నావ్?

3. అంటే, అబ్బాయిగారి చేతులో చావటం అదృష్టం అన్నమాట!

4. ఇంకా సందేహమా?

2. ...ఉహుఁ! మన కృష్ణయ్య, పాలతోపాటు, దాని పాపాలు కూడా త్రాగేశాడన్నమాట!

2. ... ఆయన త్రాగింది పాలు కాదోయ్...కాల కూట విషం!

1. అంతే అంతే...అవి పాలెలా అవుతై? రాక్షసిలో ఉండేదంతా విషమేగా!

4. అదీ నిజమే! పాలని చెబుతూ అది విషం యిచ్చిం
దన్నమాట!

2. అలా చేసికూడా అది స్వర్గానికే వెళ్లింది; అదే
మిటో మరి!

4. ఏముంది? మంచికో చెడ్డకో ఆయన్నే పదిసార్లు తల
చుకుంది. అంతే! దాని అదృష్టానికి అదే కారణం.

2. భేష్ భేష్! చాలా బాగుంది!

1. ఊహుఁ! విషమిచ్చిన రాక్షసే స్వర్గానికి వెడితే
అమృతంవంటి పాలిచ్చే ఆవులు...?

2. సందేహ మేముంది? అవి ఆయనలోనే కలిసిపోతై.
(గోపకుడు 4. ను ఉద్దేశించి)
అంతేగా బావా?

4. అంతే అంతే! ఎవరు ఏమిచ్చారూ అన్న ఆలో
చనే ఆయన కుండదు; తనమీద ఆప్రాణికి చూపు
ఉందా లేదా అని మాత్రమే ఆయన చూస్తాడు.

5. ఓహో...! అదా విషయం?

4. మరి యీలీల లన్నీ యెందుకనుకున్నావ్...?
ఆ విషయాన్ని మనకు నచ్చచెప్పటానికే!

2. ఊహుఁ! పుట్టగానే యిన్ని లీలలు చూపిస్తు
న్నాడు; పెరిగి పెద్దవాడై యింకెన్ని చేస్తాడో?

3. ఏమో... అదీ చూస్తాంగా!

4. ఆహా...! నల్లనయ్యా...నిజంగా నువ్వు నారా
యణుడివే నయ్యా!

[అత డలా అంటూ ఉండగానే మిగిలిన గోపకు లందరూ
చేయెత్తి పరమాత్మునికి నమస్కరించారు.]



## ★ ముఖ్యపాత్రలు ★

1. శకటాసురుడు
2. కృష్ణయ్య
3. యశోద

# శకటాసుర భంజనం

## ★ 1. వ ర ం గ ం ★

[ చిన్ని కృష్ణయ్య ఒదిగిల బడటం నేర్చుకున్నాడని నంద గోకుల మంతా ఉత్సవాలు చేసుకుంటోంది.

ఒకచోట కొందరు పిల్లలు కోలాటం ఆడుకుంటున్నారు. ఆ ప్రక్కనే, ఒక పొదచాటున నక్కినుంచుని ఒక రాక్షసుడు అదంతా చూస్తున్నాడు. ]

పిల్లలు : శ్రీకరమగు మా గోకులమందున
శ్రీహరి వెలిశాడు...మందకు
జీవం పోశాడు ;

మా కులమున గల శోకమునంతను
మాయం చేశాడు...మాకు
సాయంచేశాడు ! ...శ్రీకరమగు...

నందగోకులము నందున నందుని
నందనుడై పుట్టీ...యశోదా
సుందరికిని పుట్టీ...రాక్షసు
లందరినీ పట్టీ

హాతమూర్చేందుకు అవతరించినా
అయ్య నల్లనయ్యా...మాకూ
ఆతడె కృష్ణయ్యా ! ...శ్రీకరమగు...

[ అది విన్న రాక్షసుడు 'ఓహో అదా సంగతి ?' అన్నట్టు తల ఆడించాడు. ]



## ★ 2. వ ర ం గ ం ★

[ మరొక చోట కొందరు పిల్లలు, దాగుడు మూత లాడుకుంటు న్నారు. దొంగను పట్టుకోవటానికి దొర ప్రయత్నిస్తున్నాడు. దొంగచేతులో యేదో వస్తువు ఉంది.

ఆ దగ్గరలోనే ఉన్న చెట్టుమీద కూర్చుని రాక్షసుడు అదంతా కనిపెడుతున్నాడు. ]

**దొంగ:** ...ఏయ్...! ఇక్కడ...యిక్కడ...!!

**దొర:** ( ఆగి, అటుగా చూసి )

ఓ...! అక్కడా బాబూ...? అయితే సరే...వస్తు
న్నానుండు!
వస్తున్నా వస్తున్నా
వస్తున్నా నిదె వస్తున్నా!

**దొంగ:** వస్తే భయమనుకున్నావా...ఇది
యిస్తా ననుకుంటున్నావా?
చస్తే యివ్వను - చస్తే యివ్వను
రాక్షసి ననుకో - రాక్షసి ననుకో!! ఆ......!

[ అంటూ రాక్షసిలా అరిచాడు. ]

**దొర:** అరిచావని భయపడతానా?
కరిచేవని భయ పడతానా?
అరచిన పూతన కైనట్టే నీ
కౌతుందోయ్! - నిజ మంతేనోయ్!
వస్తున్నా... వస్తున్నా...!!

[ అలా అంటూనే గబగబా పరిగెత్తి దొంగను పట్టుకున్నాడు. ఆ 'దొంగ' తిరిగి రాక్షసిలా అరిచాడు. పిల్లలందరూ గొల్లు మని నవ్వారు.

పూతన పేరు వినగానే ఆ చెట్టుమీదున్న రాక్షసుని గుండె ఆగి పోయినంత పని అయింది. ]



# ★ 3. వ రం గం ★

[ అదొక ఫలహారశాల. అక్కడ నుంచుని ఒక గోపకుడు ఫల హారాల పళ్లెరాలు అందుకుంటున్నాడు ; దుకాణందారుతో యేదో మాట్లాడు తున్నాడు.

ఆ ప్రక్కనే రాక్షసుడు నక్కి ఉన్నాడు; వారి సంభాషణ వింటున్నాడు. ]

**దుకాణందారు:**

...ఇవన్నీ పంచిపెడతారా బాబూ?

**గోపకుడు:** ఆఁ...! మరేందుకనుకున్నావ్?...అయినా యివి యేమూలకి? ... చుట్టు ప్రక్కల ఊళ్లనుంచి కూడా తెప్పిస్తున్నాం!

**దుకాణందారు:**

...ఇంతకూ యివ్వాళ...

**గోపకుడు:** మన దొరగారి అబ్బాయి బోర్లపడటం నేర్చుకున్నారు ; అందుకని!

**దుకాణందారు:** ( నవ్వి )

ఉహుఁ! ఊరంత రాక్షసిని 'ఉఫ్' అని ఊదేసిన బాబు బోర్లపడ్డాడని బూరెలు పంచిపెడుతున్నారా? బాగుంది బాబూ...! చాలా బాగుంది!!

[ ఆ మాట విన్న రాక్షసుని గుండెలో కలుక్కుమంది. విషయం గ్రహించుతున్నట్టుగా అతను తల పంకించాడు. ]



## ★ 4. వరంగం ★

[ కొందరు పిల్లలు సైనికుల మాదిరి వరుసగా నడుస్తూ వెడుతున్నారు. ]

**పిల్లలు:** ...అందరమూ గొల్లలం
మందలోని వీరులం
అన్నదమ్ము లల్లె మే
మెల్లప్పుడు మెలుగుతాం !...అందరమూ...!

[ రాక్షసుడు ఆ పిల్లలను సమీపించాడు. వికటాట్టహాసం చేశాడు. అది చూసిన పిల్లలు భయపడి 'అమ్మ బాబోయ్!' అని అరుస్తూ ఎక్కడి వాళ్లు అక్కడి నుంచి పారిపోయినారు.
రాక్షసుడు వాళ్లను చూసి, తిరిగి వికటంగా నవ్వాడు. ]



## ★ 5. వరం[illegible]ం ★

[ పిల్లలు పరిగెత్తుకు పోతున్నారు. రాక్షసుడు మామూలు మనిషి రూపంలో వారి వెనుకగా వచ్చాడు. ]

**రాక్షసుడు:** ( పిల్లలవంక చూస్తూ )

...అబ్బాయిలూ...! ఏయ్...అబ్బాయిలూ...! మిమ్మల్నే !!

[ పిల్లలు వెనక్కు తిరిగి చూశారు ; ఆగారు. ]

ఏం...అలా పరిగెత్తుతున్నారు ?

**పిల్లవాడు:** 1. ఎవడో రాక్షసు డొచ్చాడండీ !

**రాక్షసుడు:** ( నవ్వి )

...రాక్షసుడా...?...

( అటూ యిటూ చూసి )

...ఏడీ... ఎక్కడా లేడే !

**పిల్లవాడు:** 1. ఏమో ... ఏమైనాడో... !

**రాక్షసుడు:** ఇంతకూ వా డెలా ఉన్నాడు ?

**పిల్లవాడు:** 2. ఎలా యేమిటి... రాక్షసల్లేనే ఉన్నాడు! తాటి కాయలంత కళ్లూ, పారల్లాంటి పళ్లూ, చాటలంత చెవులూ, పెద్ద ముక్కూ ; వాణ్ణి చూస్తే చాలు చచ్చామన్న మాటే !

**రాక్షసుడు:** ( తిరిగి నవ్వి )

...మరి మీ రందరూ-వీరులు కదూ ?

**పిల్లవాడు:** అందుకనే యింతవరకు బ్రతికున్నాం !

**రాక్షసుడు:** ( వికటంగా నవ్వి )

ఊఁ... బాగుంది. చాలాబాగుంది. ఊహుఁ!
ఎవడో రాక్షసిట ... ఇక్కడికి వచ్చాడుట ...
వీళ్లు చూశారుట!...ఏదన్నా చెబితే నమ్మేట్టుగా
ఉండాలి!

పిల్లవాడు: 1. నిజమండీ...నిజం! మేం చూశామంటుంటే...!
(మరొకనితో)
... ఏరా! నువ్వు చూడలా?
2. ఊఁ ... చూడకేం ...?
1. ఏరా ... నువ్వు ...?
3. నేనూ చూశాను!

పిల్లవాడు: (రాక్షసునితో)
విన్నారా...?

రాక్షసుడు: పోనీగాని, మీరిప్పుడు యెక్కడికి వెడుతున్నారు?

పిల్లవాడు: 1. మా స్నేహితుడి యింటికి!

రాక్షసుడు: స్నేహితుడా! అంటే...?

పిల్లవాడు: స్నేహితుడంటే స్నేహితుడే నండీ! అంటే మా కృష్ణయ్య అన్న మాట! మొన్న ఓ పెద్దరాక్షసిని చంపాడే...వాడు!

రాక్షసుడు: ఓ... అలాగా?

పిల్లవాడు: 2. ... మీరు వాణ్ణి యెరగనే యెరగరన్నమాట?

[ 'అంతే' అన్నట్టుగా రాక్షసుడు తల ఆడించాడు. అతణ్ణి చూసి పిల్లలు విచిత్రంగా నవ్వుతున్నారు; 'ఇంతమూర్ఖునితో మనకేంపని?' అనుకున్నట్టుగా అక్కడినుంచి వెళ్లిపోయినారు. వాళ్ల మాటలు విన్న రాక్షసుడు కోపంతో మండిపోయినాడు. వాడి గుండె తుకతుక లాడిపోయింది. వెంటనే వాడు విషం కక్కుతూ వికటంగా నవ్వాడు; ఏదో నిర్ణయానికి వచ్చి నట్టుగా అక్కడి నుంచి కదిలి వెళ్లాడు. ]



# ★ 6. వ రం గం ★

[ అది నందుని యిల్లు. ఆ యింటిముందు చక్కని పందిరి వేసి ఉంది. ఆ స్థలమంతా జనంతో కిట కిట లాడిపోతోంది.

వాకిట్లో ఒక బండీ ఆగి ఉంది; దానినిండా పళ్లూ ఫలహారాలూ ఉన్నై. ]

గోపకుడు: ( బండీని పరిశీలించి చూస్తూ )

...చాలు చాలు... ఇహ ఆపండి ; యింకో బండీ తెప్పిద్దాం !

[ బయటకు తెచ్చిన పళ్లెరాలను గోపకులు తిరిగి లోపలకు తీసుకు వెళ్లారు.

అదే సమయానికి, తక్కుతూ తారుతూ వచ్చి, రాక్షసుడు, ఆ బండీ ప్రక్కగా నుంచున్నాడు. గోపకు లెవరూ అతణ్ణి చూడలేదు.

రాక్షసుడు పగపట్టిన త్రాచు మాదిరి బుసలు కొడుతున్నాడు. అతని కళ్లు యింట్లో ఉన్న యెవరి కోసమో వెదుకుతున్నై. ]



# ★ 7. వ రంగం ★

[ పూజామందిరంలో మంటపం ముందు కూర్చుని యశోద ప్రార్థన చేసుకుంటోంది. ]

**యశోద:** "ఎవ్వని చే జనించు జగ
మెవ్వని లోపలనుండు లీనమై
ఎవ్వనియందు డిందు బర
మేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాది మధ్యలయు
డెవ్వడు సర్వముదానయైనవా
డెవ్వడు వాని నాత్మభవు
నీశ్వరు నే శరణంబు వేడెదన్'



# ★ 8. వ రంగం ★

[ నందుని యింటి సావిట్లో ఒక తొట్టె ఉంది. అందులో పడుకుని నిద్దురపోతున్న నల్లనయ్య అమాంతంగా లేచి కెవ్వుకెవ్వున యేడవటం మొదలు పెట్టాడు.

ఆ ప్రక్కనే ఉన్న పరిచారికలందరూ గబగబా ఆ తొట్టె వేపు పరిగెత్తారు. వారిలో ఒకామె అందులో ఉన్న నల్లనయ్య ఎత్తుకుని ఆడిస్తూ వాకిట్లోకి తీసుకు వెళ్లింది. ]



# ★ 9. వ రం గం ★

[ బండి ప్రక్కన నుంచున్న రాక్షసుడు లోపలకు చూస్తూనే ఉన్నాడు. అంతలో, కృష్ణయ్యను తీసుకుని పరిచారిక అక్కడకు వచ్చింది.

కృష్ణయ్యను చూసిన రాక్షసుడికి మొదట్లో అంతులేని ఆనందం కలిగింది. కాని, ఆ వెంటనే అతనిలో క్రోధం ప్రవేశించింది. పరిచారిక చేతులోంచి కృష్ణయ్యను అమాంతంగా యెత్తుకుపోదామా అనుకున్నాడు. అనుకోవటమే కాదు ; దాని ఫలితాన్ని తలచుకుని ఉవ్విళ్లూరాడు కూడా; కాని, వెంటనే అతడు ఆ ప్రయత్నం నుంచి విరమించుకున్నాడు; ఏం చేయాలా అన్న ఆలోచనలో పడ్డాడు ; కొద్దిగా తొలిగి నుంచున్నాడు.

మరుక్షణంలో ఆ రాక్షసుడు తన రూపాన్ని మార్చుకున్నాడు ; ఒక పసిపాపడై ఆ బండీలో ప్రవేశించాడు.

అప్పటికి ఆ పరిచారిక బండీని సమీపించింది. కృష్ణయ్య ఆ బండీలోని పళ్లవంక చూపిస్తూ మారాం పట్టిన వాడిమాదిరి యేడువసాగాడు. అది చూసిన పరిచారిక అందులోని పళ్లు ఒకటొకటే అతనికి అందించటం మొదలు పెట్టింది ; కృష్ణయ్య వాటి నన్నింటినీ కోపంతో క్రింద పడెయ్యటం సాగించాడు. ]

పరిచారిక: ...మంచివాడమ్మా! మా బాబు చాలా మంచివాడు! మా కృష్ణయ్య భలే మంచి వాడు! కాదు బాబూ? ఊఁ... ? చెప్పు !...నీకేం కావాలో చెప్పు !!

( బండీలోకి చూపుతూ )

...ఇదా... ? ...ఇదా...? ఓ...ఇదా... !!

[ అలా అంటూ ఒక్కొక్క పండే అందిస్తూ ఉంది. ఇది కాదని అదీ, అది కాదని ఇదీ చూపిస్తూ కృష్ణయ్య, ఆ రాక్షసుడున్న చోటికి పరిచారికను తీసుకు వెళ్లాడు.

అది కనిపెట్టిన రాక్షసుడు అంతకంతకు లోపలికి వెళ్లసాగాడు. అంతలోనే కృష్ణయ్య ఒళ్లు విరుచుకున్నాడు. అతను సాచిన కాలు, బండీలో ఉన్న రాక్షసుడి ముఖానికి 'దభీ' మని తగిలింది. ఆ వెంటనే అక్కడ రెండు కొండలు ఢీకొన్నంత చప్పుడయింది. రాక్షసుడు ఉరుముఉరిమినట్టుగా బాధతో అరిచాడు. అత డున్న బండీ తునాతునకలై పోయింది. అందులోని పళ్లూ అవీ క్రింద పడిపోయినై. రాక్షసుడు మామూలు రూపంలో నేల మీద పడి గిలగిలా తన్నుకోసాగాడు.

అది చూసిన పరిచారిక అక్కడే ఒరిగిపోయింది. కృష్ణయ్య క్రిందపడికూడా కిల కిలా నవ్వుతూనే ఉన్నాడు.

అప్పుడయిన మ్రోతకు జనమంతా అక్కడకు పరిగెత్తుకుంటూ వచ్చారు. వాళ్లతో పాటు యశోద కూడా వచ్చింది. రాక్షసుణ్ణి చూసి ఆమె కూడా అదలిపోయింది; "కృష్ణా! కృష్ణా!" అని వెఱ్ఱిగా అరిచింది.

అప్పటికి కృష్ణయ్య ఆ రాక్షసుని జుట్టు పీకుతూ ఆడుకుంటు న్నాడు. అది చూసిన యశోద అతణ్ణి చేతుల్లోకి తీసుకుంది.

మొదట్లో ఆ రాక్షసుని చూసిన పిల్లలు అంతలో అక్కడకు వచ్చారు; ఆశ్చర్యంతో ఒకరి వంక ఒకరు చూసుకున్నారు. ]

పిల్లవాడు: 1. అరెరె... వాడేరా...!

2. ఊఁ...వాడే! ఇక్కడి కెలా వచ్చాడో?

3. ఎలా వస్తే యేం...వచ్చాడు; కాని, యెలా చచ్చాడూ అని?

2. ఎలా చస్తేయేం చచ్చాడు; మనకు కావలసిం దదే!

1. అది సరే...! ఎవరు చంపారూ అని?

2. ఇంకా యెవరున్నారు...? ఈయనే!

3. ఎవరు...? కృష్ణయ్యా...?

1. ఆఁ! ఆయన కాకపోతే మరెవరు? ఇది నువ్వూ నేనూ చేసే పనేనా?

2. ( అప్పుడే కళ్లు తెరిచిన పరిచారికతో )
చూడు... ! ఏమిటిది ? అసలేమయింది ?

పరిచారిక: ఏముంది ? వీణ్ణి నేను చూడనేలేదు. మన బాబు చూశాడు కాబోలు ; నన్నిక్కడికి తీసుకొచ్చాడు. వచ్చీ రావటంతోనే కాలుచాచి ఒక్క తన్ను తన్నాడు. అంతే !

పిల్లవాడు: 1. ఊహుఁ ! ఆయన చూడని దేముంది... చెయ్యని దేముంది ? అదేగా ఆయనలో ఉన్న విశేషం !

[ ఆ మాటలు వింటూనే యశోద కృష్ణయ్యను హృదయానికి హత్తుకుంది ; సంతోషంతో కన్నీటిని రాల్చింది ; అతని మీద ముద్దుల వర్షం కురిపించింది. ]

పిల్లలు: ( సంతోషంతో )

చిన్ని కృష్ణయ్యకూ ... జై !
వెన్నదొంగకూ...జై ! !
నల్లనయ్యకూ...జై ! ! !



## ★ ముఖ్యపాత్రలు ★

1. తృణావర్తుడు
2. కంసుడు
3. కృష్ణయ్య
4. బలరాముడు
5. యశోద
6. రోహిణి

# తృణావర్త సంహారం

## ★ 1. వ ర ం గ ం ★

[ అది మథురా నగరంలో కంసుని మందిరం. అందులో కంసుడూ తృణావర్తుడూ ముచ్చటించుకుంటున్నారు. ]

**కంసుడు:** వింత బాలు డొకడు వ్రేపల్లెలో పుట్టి
పెరుగు చుండె ననుచు వింటి నేను
వింత లెవియొ నీవ విన్పింప వలె పోయి
రమ్ము శుభము లంది రొమ్ము సఖుడ !

**తృణావర్తుడు:**
ఓ...దానికేం...? ఇప్పుడే వెళ్లొస్తాను !

**కంసుడు:** చూడు ! వాడే హరి అయి ఉంటాడని నాకు అనిపిస్తోంది !

**తృణావర్తుడు:**
హరి కానీ ...హరుడు కానీ; మనకేం భయం ?

**కంసుడు:** ( వికటంగా నవ్వి )
...పూతన కూడా యిలాగే అని వెళ్లింది ; కాని, దాని జాడ కూడా తెలియకుండా ఉంది. అందుకనే యీ మధ్య శకటాసురుణ్ణి పంపాను. వాడు కూడా యింత వరకు తిరిగి రాలేదు ; ... మరి నువ్వు ...

**తృణావర్తుడు:**
ఏం ఫరవాలేదు. ఇక్కడున్నట్టుగా వచ్చేస్తాను.

**కంసుడు:** చూడు ! ఆ కుఱ్ఱవాడు కనబడితే, ..

**తృణావర్తుడు:**

ఏముంది...; అమాంతంగా యెగరేసు కొచ్చేస్తాను!

**కంసుడు:** భేష్! అసురు డంటే అలా ఉండాలి!

**తృణావర్తుడు:**

...సెలవిస్తారా...!

**కంసుడు:** ఊఁ...! ఆలశ్యం దేనికి?

[ తృణావర్తుడు గర్వంతో ఆక్కడినుంచి కదిలాడు. అతను కనుచూపు మేర దాటేవరకూ కంసుడు అతని వంక చూస్తూనే ఉన్నాడు. ]



## ★ 2. వ ర ం గ ం ★

[ నంద గోకులంలో ఒక గుడిముందు కొందరు పిల్లలు ఆడుకుంటు న్నారు. వాళ్ల ప్రక్కనే బలరాముడు కూర్చున్నాడు; అతని ఒళ్లో కృష్ణయ్య పడుకుని ఉన్నాడు. ]

**పిల్లవాడు:** 1. ఉహుఁ! ఏమనుకున్నావో! మనం తలుచుకుంటే మంద యెందుకూ పనికిరాదు!

[ కొందరు పిల్లలు నవ్వారు. ]

2. ఓష్...అంతేనా...? మనం గుర్తుకొస్తేచాలు...

**మరికొందరు పిల్లలు:**

ప్రపంచం అంతా గడగడలాడి పోతుంది!

[ ఇతరులు పకపకా నవ్వారు ]

3. అరేయ్! మీ రిద్దరూ మొనగాళ్లేరా; నాకు తెలుసు!

1. అహఁహఁ! అదెలా అవుతుంది? ఐతే వాడైనా కావాలి; లేకపోతే నేనైనా కావాలి; అంతే!

2. అది నేను ఒప్పుకోను. అసలు 'మొనగాడ'నే మాట పుట్టిందే మనకోసం; వింటున్నావా? 'మరొక డున్నాడు' అంటే మనం ఒప్పుకోం!

1. అలా వస్తే మనమూ అంతే!

3. ఇక యిదెలా తేల్తుంది?

4. ఎలాగో అలా యివ్వాళ తేలిపోవలసిందే!

3. అయితే మీరు నేను చెప్పినట్టు చేస్తారా?

**ఇద్దరూ:** ఓ...!

**పిల్లవాడు:** **3.** మళ్లీ కాదంటే వీల్లేదు !

**ఇద్దరూ:** అనం...అనం...అనం...! ముమ్మాటికీ అనం ! సరేనా ?

**పిల్లవాడు:** 3. ఊఁ ! అయితే, మన అందరిలోకీ చిన్నవా డెవరో చెప్పండి !

**ఇద్దరూ:** ఇంకా యెవరు... కృష్ణయ్యే !

**పిల్లవాడు:** **3.** ఆఁ ! ఔనా ?... ఆ కృష్ణయ్య నెత్తుకుని యీగుడి చుట్టూ యెవడు యెక్కువ సార్లు తిరిగితే వాడూ మొనగాడు ; ఒప్పుకుంటారా ?

**పిల్లలు:** 1. 2. ఓ... తప్పకుండాను !

**పిల్లవాడు:** **4.** ...ఇదో పందెం ?

**5.** పందెం అంటేనే యిది ! చాలా బాగుంది !

6. అయితే...

1. అయితే లేదు గియితే లేదు; కానీరా !

**3.** ( **1.** వ కుఱ్ఱవానితో )

... నువ్వు ఒప్పుకున్నట్టేగా ?

**1.** ఆఁ... !

**3.** ( **2.** వ కుఱ్ఱవానితో )

... ఏరా ... నువ్వు ... ?

**2.** ఊఁ ... !

1. ( తన స్నేహితునితో )

... మనకిదో లెక్కా ? కన్ను మూసి తెరిచే లోపల కనీసం తొంభై సార్లన్నా తిరిగేస్తాం. ఏమంటావ్ ?

**2.** ( తన స్నేహితునితో )

... ఏరా ... మనం ?

7. మన మాట చెప్పేదేముంది ? కన్ను మూసేలోపల తొంభై సార్లూ, తెరిచేలోపల తొంభై సార్లూ 'భట్టున' తిరిగేస్తాం... అంతేగా ?

[ 1. వ పిల్లవాని స్నేహితులు విరగబడి నవ్వారు ]

3. ...ఐతే ముందు నువ్వు కానీరా !

1. ఓ ...! మనం యెప్పుడూ తయారే !

[ ఆ వాదం వింటున్న కృష్ణయ్య బలరాముని వంక చూసి చిలిపిగా నవ్వాడు.

1. వ పిల్లవాడు కృష్ణయ్యను యెత్తుకున్నాడు ; పరిగెత్తడం మొదలు పెట్టాడు. పిల్లలందరూ అతనితో పాటు పరిగెత్తారు. ఆ విధంగా మూడుచుట్లు తిరిగేటప్పటికి ఆ పిల్లవానికి అలసట వచ్చింది. నాలుగోచుట్టు తిరగటానికి అతను బయలుదేరాడు; కాని, తూలిపోయినాడు.

అంతలో అతని చేతులు పట్టు తప్పినై. అతని చేతులో ఉన్న కృష్ణయ్య జారి క్రింద పడ్డాడు ; యేడవటం మొదలు పెట్టాడు. అక్కడున్న పిల్లలందరూ కృష్ణయ్యను చూసి జాలి పడ్డారు ; అతణ్ణి పడేసినందుకు 1. వ పిల్లవాణ్ణి తలోమాటా అన్నారు.

ఆ వెంటనే 3. వ కుఱ్ఱవాడు ముందుకు వచ్చి కృష్ణయ్యను యెత్తుకుని సముదాయించాడు ; తిరిగి బలరాముని ఒళ్లో పడుకో పెట్టాడు. అంతలో 2. వ పిల్లవాడు రంగంలోకి దిగాడు. ]

**పిల్లవాడు:** 2. భేష్ ! బలే మొనగాడివిరా ! ఈమాత్రానికేనా యిన్ని కోతలు కోశావ్ ? చేతగానప్పుడు చేతగానట్టే ఉండాలి గాని, యిలా పందెం వెయ్యటం దేనికి ; పసివాణ్ణి పడేయటం దేనికి ...? అయినా ...

చివురుటాకు బోలు చిన్నికృష్ణుని మోయ
లేని నీవు చేయ నైన దెద్ది ?
చూడుమేను వాని నాడింతు ముల్లోక
ములను చుట్టివచ్చి మురియ నతడు

[ ఆ మాట అంటూనే అతను కృష్ణయ్యను యెత్తుకోబోయినాడు. చేతులు పుచ్చుకుని లేవతీయాలనుకున్నాడు; కాని, లాభం లేకపోయింది. వీపు క్రింద చేయివేసి యెత్తాలని ప్రయత్నించాడు; కాని కృష్ణయ్య లేవ లేదు. అది చూసిన పిల్లలందరూ పకపక లాడారు.

ఆ వెంటనే ఆ కుఱ్ఱవాడు కృష్ణయ్యను తన వేపుకు లాగాలని తన బలం అంతా ఉపయోగించాడు; కృష్ణయ్య కదలక పోవటంవల్ల తనే వెనక్కు పడ్డాడు. పిల్లలందరూ మళ్లీ నవ్వారు. ఆ కుఱ్ఱవానికి యెక్కడ లేని రోషమూ వచ్చింది. ]

పిల్లవాడు: 1. ... అయిందా...అయ్యగారి పని?

[ కొందఱు పిల్లలు తిరిగి నవ్వారు. ]

2. నవ్వటం కాదు; యిప్పు డెత్తుకోవాలి; అదీ మొనగాడితనం!

1. అయితే మళ్లీ ఎత్తుకోమంటావ్; అంతేనా?

2. ఆc...యెత్తుకో; చూద్దాం!

[ మొదటి పిల్లవాడు వెంటనే ముందుకు వెళ్లి కృష్ణయ్యను తేలిగ్గా లేవదీశాడు. అతని స్నేహితులందరూ అతనికి జేజేలు చెప్పారు. అంతలో అతనికి గర్వం వచ్చింది. ఆ వెంటనే అతను కృంగి పోవటం మొదలు పెట్టాడు. ]

పిల్లవాడు: 1. అయ్యయ్యో! ...ఇదేమిటి? అయ్యో...! బరువెక్కి పోతున్నాడే! అమ్మ బాబోయ్!

[ అలా అంటూనే అతను నేలకు ఒరిగిపోయినాడు. ఈమాటు 2. వ కుఱ్ఱవాడూ అతని స్నేహితులూ విరగబడి నవ్వారు. అంతలో మధ్యవర్తి ముందుకువెళ్లి అతని చేతులో ఉన్న కృష్ణయ్యను అందుకున్నాడు; హృదయానికి హత్తుకున్నాడు. ]

3. కృష్ణా...! కృష్ణా...!! నువ్వు నిజంగా మాయ మనిషివే నయ్యా!

[ అక్కడే దాక్కుని ఉన్న తృణావర్తుడు అదంతా చూశాడు. అతనికి ఆశ్చర్యం వేసింది. కంసుడు చెప్పిన వింత బాలుడు అతడే అయి ఉంటాడని అత డప్పుడు నిర్ణయించుకున్నాడు. ఆ వెంటనే అక్కడినుంచి మెల్లదిగా కదలి వెళ్లిపోయినాడు.

మరుక్షణంలో అక్కడ తుపానుగాలి చెలరేగింది. గోకులం అంతా కల్లోలంలో మునిగి పోయింది. గొడ్లన్నీ కట్లు తెంచుకుని అరుస్తూ అటూ యిటూ పరిగెత్తినై. పెద్దలూ పిన్నలూ అందరూకూడా హాహాకారాలు చేశారు. చిన్నచిన్న పర్ణశాల లన్నీ ఆకాశంలోకి యెగిరిపోసాగినై.

అంతవరకు అక్కడ ఆడుకుంటున్న పిల్లలు యెక్కడివాళ్లక్కడి నుంచి పారిపోయినారు. చివరకు అక్కడ, ఆ చీకట్లో మిగిలిందల్లా చిన్నికృష్ణయ్యా బలరాముడూ మాత్రమే.

అంతలో పిల్లలకోసం వెతుక్కునే తల్లుల పిలుపులు దూరం నుంచి వినిపించినై. ]



# ★ 3. వ రం గం ★

[ గోకులంలో ఒకానొక వీధి. అక్కడ అటూ యిటూ చూస్తూ యశోద కృష్ణయ్యకోసం వెదుకుతోంది. ]

**యశోద:** ... కృష్ణయ్యా ! కృష్ణయ్యా...!! కృష్ణయ్యా...!!

**రోహిణి:** ( మరొక దిక్కునుంచి ప్రవేశించి )

రామా...! రామా !!...బలరామా...!!

[ అలా కేకలు పెట్టుకుంటూ యశోదా రోహిణీ అటూ యిటూ వెదుకుతున్నారు.

అంతలో దూరంనుంచి 'అమ్మా...! అమ్మా...!' అన్న బలరాముని గొంతు వారికి వినిపించింది. యశోదా రోహిణీ అటుగా వెళ్లారు. ]



## ★ 4. వ ర ం గ ం ★

[ ఊరిబయట ఒక చెట్టుక్రింద నుంచుని బలరాముడు పైకి చూస్తున్నాడు; యేడుస్తున్నాడు.

అంతలో రోహిణీ యశోదా అతణ్ణి సమీపించారు. రోహిణి గబగబా వెళ్లి అతణ్ణి కౌగిలించుకుంది. ]

**రోహిణి:** ... నాయనా...! తమ్ము డేడీ? కృష్ణయ్య యేడీ?

[ బలరాముడు యేడుస్తూనే ఆకాశం వేపు చూపించాడు. రోహిణీ యశోదా అటు చూశారు; చూసి, భయపడిపోయినారు. రోహిణి 'కృష్ణా...! కృష్ణా . ! అంటూ కూలిపోయింది. అంతలో మంద వేపునుంచి 'కృష్ణయ్యా...! కృష్ణయ్యా!!' అన్న గోపికల గొంతు అక్కడివాళ్లకు వినిపించింది. ]

**యశోద:** కృష్ణయ్యా... !......కృష్ణయ్యా... !!

కృష్ణయ్యా! కృష్ణయ్యా!
కృష్ణయ్యా! యెచటి కటుల నేగెదు తండ్రీ?
జిష్ణుం డనుకొంటిమి మా
కృష్ణుం; డది కలయటోయి కృష్ణా! కృష్ణా!!

[ అంతలో పైనుంచి ఉరుములు ఉరిమినట్టయింది. క్రింద గోకులంలో 'కృష్ణా! కృష్ణా!' అన్నపిలుపు నలుదెసలా మారుమోగింది. ]

కన్నారి! కృష్ణయ్యా... !
మర్మ మెరిగిన వాడవై మాయదారి
పూతనం జంపి దాని తోబుట్టువైన
వాని శకటాసురుం గూల్చి వన్నె కెక్కి
గాలి కెగురుటయా నేడు కన్నతండ్రి ?

**తృణావర్తుని గొంతు:** ( పైనుంచి )

ఊఁహూఁ! నువ్వే అన్నమాట; మా వాళ్లను
మ్రింగేసింది! ఊఁ...!

**గోపికల గొంతు:** ( దూరంనుంచి )

నిన్ను గని మేము ధన్యత గన్న యటుల
నాడు చుంటిమి; నీవ దిక్కనుచు గూడ
నమ్మికొంటిమి; నేడు ప్రాణములు తీసి
నావురా గాలిదేలి బంగారు తండ్రి!

[ అది విన్న తృణావర్తుడు వికటంగా నవ్వాడు. ]

**యశోద:** ( రోదిస్తూ )

నను చూడవేమిరా నా
యన? నా గోడును గ్రహింపవా నా తండ్రీ?
నిను గన్నదాని, నమ్మను
వినవా? దిగిరావ? దివ్య విగ్రహా! కృష్ణా!!

[ అంతలో పైనుంచి పిడిగ్రుద్దులు వినిపించినై. ]

**బలరాముడు:**

... అమ్మా ...! అమ్మా...!!

[ అలా పిలుస్తూ ఆకాశంవేపు చూపించాడు. ]

**రోహిణి:** అయ్యయ్యొ ...! ఒదినా...అటుచూడు! ఆ రాక్షసుడు అబ్బాయితో పోట్లాడుతున్నాడు!

[ పై నుంచి, గ్రుద్దులు, పిడుగుల మాదిరి వినిపిస్తున్నై. ప్రతి దెబ్బకూ రాక్షసుడు 'అమ్మో...! అయ్యో!' అంటున్నాడు.

అది వింటున్న బలరాముడు అతి ఉత్సాహంతో చప్పట్లు చరుస్తున్నాడు. యశోదా రోహిణీ అటే పైకి చూస్తూ నుంచున్నారు; ఒళ్లు మరచి ఉన్నారు.

అంతలో వారికి ఒక పెద్ద కేక వినిపించింది. ఆ వెంటనే ఉండచుట్టి ఉన్న రాక్షసుని బొట్టు వారి ముందు పడ్డది.

ఆది చూసిన బలరాముడు సంతోషంలో తిరిగి చప్పట్లు చరిచాడు; గిరగిరా తిరగటం మొదలుపెట్టాడు.

ఆ వెంటనే ఉక్కిరిబిక్కిరౌతున్న రాక్షసుని గొంతు వారికి విని పించింది.

అంతలో, కుండలతో పోసినట్టుగా పైనుంచి నెత్తురు కురిసింది. అది చూసిన గోకుల మంతా 'కృష్ణా! కృష్ణా!" అని అరిచింది. గోవు లన్నీ ఆనందంతో అంభారావం చేసినై. ]

**తృణావర్తుని గొంతు:**

ఉహూఁ!

తిరుగులేని వీని తేజమ్ము కాల్పనా
మోసముననె కూల్చ బూన నన్ను?
పాపడౌచు వచ్చి ప్రాణమ్ము తీయుటా
హరియటన్న వాడు? హరి! హరి! హరి!!

[ ఆమాటలు గోకుల మంతటా మారు మోగినై. అవి విన్న జనం 'శ్రీకృష్ణ పరమాత్మకూ జై' అని అరిచారు.

అంతలో పైనుంచి పెద్దపెద్ద చేతులూ కాళ్లూ నేలమీద పడ్డై. ఆ తరువాత ఆ రాక్షసుని తలా మొండెమూ విడివిడిగా క్రిందకు జారినై. వాటితోపాటు కృష్ణయ్య కూడా క్రిందకు దిగాడు.

బలరాముడు చకచకా పరిగెత్తుకువెళ్లి కృష్ణయ్యను కలుసుకున్నాడు. యశోద వారిద్దరినీ కౌగిలించుకుంది; అమితమైన ఆనందంతో కృష్ణా! కృష్ణా! అంటూ అతణ్ణి ముద్దులుపెట్టుకుంది. ]

**రోహిణి:** వదినా...! నీ అదృష్టం యింతా అంతా కాదమ్మా!

**యశోద:** ఏమి అదృష్టమో నమ్మా...! ఈయనతో జీవితం దిన దిన గండంగా ఉంది.

**రోహిణి:** అయితే మాత్రం యీయన్ని నువ్వూ నేనూ కాపాడాలా యేమన్నా నా?

**ఉపనందుడు:** మనం తెలుసుకోవలసిందే అది!

“ రక్షణము లేక సాధుడు
రక్షితుడగు సమతజేసి రాయిడు లందుణ్;
రక్షణములు వెయి గలిగిన
శిక్షితు డగు ఖలుడు సాపచిత్తుం డగుటణ్ ”

అని పెద్దలు ఊరికే చెప్పారా?

**గోపికలు:** ( ప్రవేశించి )

“ గత జన్మంబుల నేమి నోచితిమొ
యాగశ్రేణు లేమేమి జే
సితిమో యెవ్వరి కేమి వెట్టితిమొ
యే చింతారతిం బ్రొద్దుపు
చ్చితిమో సత్యము లేమి వల్కితిమొ
యే సిద్ధ ప్రదేశంబు ద్రొ
క్కితిమో యిప్పుడు సూడగంటి మిచటం
గృష్ణార్భకుణ్ నిర్భయుణ్ ”

[ గోపిక లందరూ యెవరి మనసులో వారు కృష్ణయ్యకు నమస్క-
రించు కున్నారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. యశోద
4. రోహిణి

# విశ్వరూప ప్రదర్శనం

## ★ 1. వ ర ం గ ం ★

[ అది నందగోకులంలో ఒక యిల్లు. అందులో ఒక బాలెంతరాలు మజ్జిగ చేస్తూ ఉంది.
అక్కడికి ఆ పొరుగింటావిడ వచ్చింది. ]

ఇల్లాలు: 1. ...రా అమ్మా రా...! ఏం యిలా వచ్చావ్ ?

2. ...ఏం లేదక్కయ్యా ; కాసిని పాలు కావలసి !

1. అయ్యొయ్యొ రామ ! అడగ్గా అడగ్గా పాలే అడిగావు తల్లీ ! ఉఁహూఁ !

2. అదేమిటి...అలా అన్నావ్ ?

1. ఏముందమ్మా ? ఈ మధ్య చంటిదానిక్కూడా యీ పాలే పోస్తున్నాం. మొన్నటి నుంచీ అవి కూడా అంతంత మాత్రంగానే ఉన్నై; ఏం చెప్పమంటావ్ ?

2. అయ్యొయ్యొ పాపం !

[ తలుపు ప్రక్కగా నుంచున్న కృష్ణయ్య ఆమాటలు విన్నాడు. విని, కొంటెగా తల పంకించాడు; ఆప్రక్కనే కట్టేసిఉన్న దూడను మెల్లగా విడిచిపెట్టాడు.
ఆ దూడ చెంగుచెంగున వెళ్లి అక్కడే ఓ ప్రక్కగా ఉన్న తన తల్లి దగ్గిర పాలు కుడవటం మొదలు పెట్టింది.
కృష్ణయ్య, సంతోషంతో చిందులేస్తూ మెల్లమెల్లగా అక్కడి నుంచి జారుకున్నాడు. ]



# ★ 2. వ రంగం ★

[ గోకులంలో అదొక యిల్లు. అందులో ఒక అత్తా కోడలూ నిద్దుర పోతున్నారు.

కృష్ణయ్య మెల్లగా ఆ యింట్లో ప్రవేశించాడు. ప్రవేశించి ఆ ప్రక్కనే ఉన్న కుండదగ్గరకు వెళ్లాడు.

ఆకుండ వెన్నతో నిండి ఉంది. అది చూసిన కృష్ణయ్యకు అంతు లేని సంతోషం కలిగింది. ఆవెంటనే అతను యేవిధమైన భెరుకూ లేకుండా ఆ కుండలో ఉన్న వెన్నంతటినీ గుటుకు గుటుకున మ్రింగేశాడు. అందులో మరేమీ మిగిలిలేదని తెల్సుకున్న తర్వాత గుట్టు చప్పుడు కాకుండా బయట పడ్డాడు.

బయటకు రాగానే అతనికేదో ఆలోచన తట్టింది; తనలో తాను చిలిపిగా నవ్వుకున్నాడు.

ఆ వెంటనే కృష్ణయ్య తిరిగి లోపలకు వెళ్లాడు. ఈమాటు అతను అక్కడ పడుకున్న పడుచును సమీపించాడు. ఒక క్షణం ఆమె వంక చూసి, ఆమె మంచినిద్దురలో ఉన్నదని తెల్సుకున్నాడు; ఆ వెంటనే తన చేతిని ఆమె మూతికి రాచాడు.

చల్లని చేయి మూతికి తగలగానే ఆ పడుచు కొద్దిగా కదిలింది. అది గ్రహించిన కృష్ణయ్య కిలకిలలాడుతూ బయటకు ఉరికాడు; ఆమెకు కనబడకుండా పారిపోయినాడు.

అంతలో ఆ పడుచు గాభరాపడుతూ లేచింది. లేస్తూనే 'దొంగ దొంగ...! అత్తయ్యా...దొంగ...!' అంటూ అరిచింది.

కోడలు వేసిన కేకలు అత్తకు మెలకువ తెప్పించినై. ఆమె లేచింది. లేచి, రెండు చేతులతోనూ కళ్లు గట్టిగా మూసుకుంది. అలా మూసుకుని ఉండే, 'అబ్బాయ్ ..! అరే అబ్బాయ్! దొంగరా ...దొంగ!' అని అరచింది. ]

కోడలు: ( ఉబికివచ్చే నవ్వును ఆపుకుంటూ
... దొంగ పారిపోయినా డత్తయ్యా ... యిప్పు డిక్కడ లేదు !

[ అది విన్న అత్త కళ్లు తెరచి నలువంకలా చూసింది. ]

... ఇప్పుడే యిలా వెళ్లా డత్తయ్యా... యిప్పుడే!

[ అప్పుడు అత్త కోడలివంక చూసింది. చూడగానే ఆమెకు యెక్కడ లేని నవ్వొచ్చింది. ]

అదేమిటి? ఇంట్లో దొంగలు పడ్డారంటే యిలా నవ్వుతారేమిటి ?

అత్త: ( నవ్వును అణచుకుంటూ )
పడ్డది పరాయి దొంగ కాదుగా. భయమేముంది ? అదీకాక యింటిదొంగ నెవరేం చేస్తారు ?

[ అత్తమాటలు అర్థంకాక కోడలు ఆమె వంక వెలాతెలా పోతూ చూసింది. ]

... ఏదీ ... ఒక్కసారి అద్దంలో చూసుకో అది నీకే కనబడుతుంది !

కోడలు: ...నేనే మన్నా అబద్ధమాడుతున్నా ననుకున్నారా ?

అత్త: అనుకుంటే మటుకు అనటానికి గుండె లేవీ?... అయినా అత్తలు అబద్ధమాడతారు గాని అద్దం అబద్ధమాడుతుందా ... నువ్వే చెప్పు ?

కోడలు: మీ మాటలు నాకేమీ అర్థం కావటం లేదు !

అత్త: ఎలా అవుతయ్యమ్మా...! నాకు తెలియదూ? ఊఁ...
... ముసలివాళ్ల మాటలకేం గాని మూతి తుడుచు కోవే కోడలా !

[ కోడలు మూతితుడుచుకుంది. దాంతో మూతికిఉన్న వెన్న ఆమె చేతికి అంటింది. ఆవిడ ఆశ్చర్యపోయింది. ]

**కోడలు:** అయ్యయ్యొ్య... ! ఇదేమిటి? ఇదేం అన్యాయం...

**అత్త:** (నవ్వుతూ)
అన్యాయమో న్యాయమో అబ్బాయి వచ్చి అర్థమయ్యేట్టు చెబుతాడులే! పడుకో...!! ఊఁ... పడుకో !!

**కోడలు:** అయ్యో ... అయ్యో ... మోసం ... ! అంతా మోసమే !

**అత్త:** (తీవ్రంగా చూస్తూ)
నోరు మూసుకోవే నంగ నాచీ!...మూసుకో !!

[ అలా అంటూనే ఆవిడ కోడలి నెత్తిమీద ఒక మొట్టికాయ వేసింది. దాంతో కోడలు లోలోపల యేడుస్తూ పడుకుంది. ]



## ★ 3. వరంగం ★

[ ఒక యిల్లాలు యింట్లో పనిచేసుకుంటూ ఉంది. ఆ సమయంలో కృష్ణయ్య లోపల ప్రవేశించాడు. ఇల్లాలు తన పనిలో తాను ఉన్నదేకాని కృష్ణయ్యను చూడలేదు.

లోపలకు వెళ్లిన కృష్ణయ్య వెంటనే ఒక పెరుగుకుండతో బయటకు వచ్చేశాడు. వచ్చి, అక్కడే గోడప్రక్కగా నుంచుని అందులో ఉన్న మీగడ పెరుగంతా తినేశాడు. ఆ తరువాత ఆ ఖాళీకుండతోసహా ఆప్రక్క యింటి వేపుగా వెళ్లాడు.

అక్కడ ఆ యింటావిడ గుమ్మంలో తలపెట్టి పడుకుని ఉంది; గండుపిల్లులు పోట్లాడుతున్నట్టుగా గుఱ్ఱుపెడుతోంది.

కృష్ణయ్య మెల్లగా ఆ యింట్లోకి వెళ్లాడు. వెళ్లి, తనచేతిలోఉన్న కుండను లోపల వదిలేసి చప్పుడుకాకుండా బయటికి వచ్చేశాడు.

అంతవరకు పనిలో మునిగిఉన్న యిల్లాలు, పని పూర్తికాగానే తలుపువేపుగా వచ్చింది. వచ్చీరావటంతోటే దారి పొడుగునా ఉన్న పెరుగుచారలు చూసింది.

ఆ వెంటనే ఆవిడ లోపలకువెళ్లి తిరిగి బయటకు వచ్చింది; ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి తల ఆడించింది. ]

...ఊఁ...! ఇహ ఊరుకుంటే లాభంలేదు; దొంగను పట్టుకు తీరాలిసిందే!

[ అలా అనుకుంటూనే ఆవిడ ఆ పెరుగుచార చూసుకుంటూ బయటకు వెళ్లింది. మరుక్షణంలో ప్రక్కయింటి వాకిట్లోకి వచ్చింది; నివ్వెరపోయి అక్కడే నిలబడ్డది. ]

ఊఁ...! ఈ మహాతల్లేనా యీ పని చేసింది; ఇంత వరకు యెవరో అనుకుంటున్నాను. ఉఁహూఁ! ఎంత ఉంటే యేం...దొంగ బుద్ధి దొంగ బుద్ధే!

[ ఏదో నిర్ణయానికి వచ్చినట్టుగా తల ఆడించి, గొంతు సవరించుకుంది. ఆ యిల్లాలిని సమీపించింది. ]

...ఒదినా...! ఓ...ఒదినా...!!

[ ఆ యింటావిడ యింకా గుఱ్ఱుకొడుతూనే ఉంది. ]

...ఉహుఁ! తెలివితేట లంటే యిలా ఉండాలి. గుట్టు చప్పుడు కాకుండా కుండ పట్టు కెళ్లి గుఱ్ఱు కొడుతూ పడుకుంది; అదీ గొప్పతనం!

[ అలా అనుకుంటూనే ఆవిడదగ్గరగా వెళ్లి మోచేత్తో ఆమె ముఖం మీద రాస్తూ 'అంభా!' అని అవుదూడల్లే అరచింది. ]

ఇల్లాలు: 2. ( కళ్లు తెరవకుండానే చెయ్యి విసరికొట్టి .. )

...ఛీ...పో...!

( మరో ప్రక్కకు తిరుగుతూ... )

అబ్బ! దూడలు కాదు గాని; దుంప తెంపేస్తున్నై.

[ ఆమె విసరిన చేయి మొదటి యిల్లాలి చెంపకు దభీమని తగిలింది. ఆ యిల్లాలి గ్రుడ్లల్లో నీళ్లు గిఱ్ఱున తిరిగినై. దాంతో ఆవిడకు యెక్కడలేని కోపమూ వచ్చింది. వెంటనే ఆవిడ ఆ యిల్లాలి జుట్టు పట్టుకుంది; అటూ యిటూ ఊపింది.

ఆ యిల్లాలు 'అయ్యో ఆయ్యో!' అంటూ లేచింది. ]

ఏమిటమ్మా యిది? ఏమిటీ అఘాయిత్యం?

ఇల్లాలు: ఇంకా సిగ్గులేక యేమిటని అడుగుతున్నావా?

( ఆ పెరుగుచార చూపిస్తూ )

చెప్పు! ఇదేమిటో నువ్వే చెప్పు...!!

2. ( అటుచూసి, ఆశ్చర్యపడి .. )

...ఏముంది...? పెరుగు...!

1. అదే...! ఇక్కడికి యెలా వచ్చిందీ అని...?

2. ...ఏ పిల్లులో చేరవేసి ఉంటై...! అయినా దీని కింత గొడవ దేనికీ అంటా!

1. ఉహుఁ...! పాపం! ఏమీ తెలియదు!

2. ఇందులో తెలియందేముందమ్మా? పెరుగు కనబడితే పిల్లు లూరుకుంటయ్యా? అయినా మా యింటి విషయం నీకు దేనికి చెప్పు?

1. ఓ...అదా నీ సందేహం! అయితే విను. ఇది మీ విషయమే కాదమ్మా; మాకు సంబంధించిందికూడాను.
2. అంటే...?
1. ఏముంది? నువ్వు 'మీది' అనుకునే పెరుగు నిజానికి మాది. తెలిసిందా?
2. ...ఏమిటీ?
1. అదే! అయినా తెలియక అడుగుతాను; యీ మధ్య పిల్లులు పాలూ పెరుగూ తాగటమే కాకుండా కుండలు కూడా కొట్టుకెడుతున్నయ్యా...వదినా?

[ ఇల్లాలు. 2. అదేమిటో అర్థంకానట్టు చూసింది. మొదటి యిల్లాలు రెండవ యిల్లాలి జుట్టు పట్టుకుని మళ్లీ ఊపింది. ]

...నంగనాచిలా అలా చూస్తావేం?

2. ...చూడమ్మా...చూడు! ఏమిటీ అల్లరి? నీకేమన్నా పిచ్చెక్కిందా?
1. ఓహో! ఇది యింకో యెత్తన్న మాట!... "దీనికి పిచ్చెక్కింది...ఆ పిచ్చిలో ఓ పెరుగు కుండ తెచ్చి మా యింట్లో పెట్టింది. అలా తెచ్చిపెట్టి, మా మీద దొంగతనం కట్టింది" అని అల్లరిచేద్దామనుకున్నావు; అంతేనా? ... ఊహుఁ ... యిలా ఊరిమీదపడి బ్రతికేకంటె ఉరిపోసుకు చావటం మేలు!
2. చూడమ్మా...! ఇష్టం వచ్చినట్టల్లా మాట్లాడితే యేం బాగుంటుంది? ...ఇంతకూ అసలు పెరుగు కుండేమిటి...? దొంగతనమేమిటి...? ఏమిటిదంతా?
1. ఊహుఁ...ఇంకా మత్తు వదల్లేదన్న మాట! అయినా, ఇంతకంటె వివరంగా యెలా చెప్పేది?

ఊఁ...! సరే ; వినమ్మా...విను ! 'నువ్వు' ... అంటే మర్యాదస్తురాలల్లే నటించే నువ్వు, 'మా పెరుగు కుండను' ... అంటే, మా పాడితో మేం తయారు చేసుకుని వాడుకునే పెరుగును, అది ఉన్న కుండతో సహా, 'దొంగిలించావ్' అంటే, మా కంట్లో కారం కొట్టి తీసుకొచ్చి మీ యింట్లో పెట్టుకున్నావన్న మాట ! ఇప్పుడయినా అర్థమయిందా ?

[ ఇల్లాలు. 2. ఆమెవంక తెల్లబోయి చూస్తూ నుంచుంది. ఇల్లాలు. 1. కి అంతులేని కోపం వచ్చింది. ]

...గుడ్లగూబల్లే అలా చూస్తావేం... ? ఇస్తావా... యివ్వవా ?

[ వాళ్లు అలా పోట్లాడు కుంటూ ఉండగానే కృష్ణయ్య అక్కడకు వచ్చాడు; అతని చేతులో ఒక తేలు ఉంది. కృష్ణయ్య యేమీ యెరగని వాడల్లే లోపలకు వచ్చి, ఆపోట్లాడే ఆవిడను సమీపించాడు; యెవ్వరికీ యే అనుమానమూ లేకుండా ఆ తేలును ఆవిడ కాలిమీద వదలిపెట్టాడు. ]

కృష్ణయ్య:
ఏమిటి అత్తయ్యా... ? ఏమిటీ అల్లరి ?

ఇల్లాలు: 1. ...ఏం లేదు నాయనా... !
... అమ్మ బాబోయ్ ! చచ్చాన్రా దేముడా ! ... అమ్మో... ! అమ్మో... !

కృష్ణయ్య: ఏమీ లేదంటూనే యేడుస్తావేమి టత్తయ్యా ?

ఇల్లాలు: 1. చచ్చానరో... ! చచ్చాన్రా బాబూ... ! అయ్యో... ! అయ్యో... !

ఇల్లాలు: 2. ఏమయిందమ్మా... ? ఏమయిందీ... ?

కృష్ణయ్య: ( అటూ యిటూ చూసి )
... ఇది గిదిగో... ! తే లత్తయ్యా... తేలు !!

ఇల్లాలు: 2. ...అయ్యో పాపం... ! కుట్టింది కాబోలు !

కృష్ణయ్య: ( ఇల్లాలు 1. తో )
... ఏ మ త్తయ్యా... అంతేనా ... ?
[ ఇల్లాలు బాధతో గిలగిల లాడిపోతోంది; ఆవిడ కృష్ణయ్యమాట వినే స్థితిలో లేదు. ]

ఇల్లాలు: 2. ... ఏమమ్మా... ! కుట్టిందా... ?

కృష్ణయ్య: కుడితే యే మ త్తయ్యా ! ఏం ఫరవా లేదు !!

ఇల్లాలు: 2. అదేమిటి నాయనా అలా అంటావు ? పాపం ఆవిడ యెలా యేడుస్తోందో చూడు !

కృష్ణయ్య: ( రహస్యం చెబుతున్నట్టుగా )
ఏడవాలిసిందే అ త్తయ్యా ! అలా యేడి స్తేనే ఒంట్లో ఉన్న విషం కాస్తా కన్నీ రై కారిపోతుంది !

ఇల్లాలు: 1. ...అమ్మో ! అయ్యో...! చచ్చాన్రా బాబూ...!

కృష్ణయ్య: ( ఇల్లాలు. 1. తో )
...అ త్తయ్యా... ! అ త్తయ్యా... ! ! నా మాట విను !

ఇల్లాలు: 1. ( చిరాకుగా )
... మాటా లేదు మన్నూ లేదు. ఓ పక్క బాధతో చస్తుంటే యేమిటీ గోల ?

కృష్ణయ్య: ( మూతి విరిచి )
...ఊఁ... నిజమే ! ఐనా...నా కెందుకొచ్చింది ?
(ఇల్లాలు. 2. తో)
...చూశావుగా అ త్తయ్యా... ! మాట వింటుం దేమో...మంత్రం వేద్దాం ; అనుకున్నాను.

ఇల్లాలు: 2. నీకు మంత్రాలు కూడా వచ్చున్నమాట !

కృష్ణయ్య: ... 'ఒచ్చు' అని చెబితే యేం లాభం; నువ్వే చెప్పు !

**ఇల్లాలు:** 2. ఔను నాయనా...నిజమే! ఏ పుట్టలో యే పాము వుందో యెవరికి తెలుసు ? ...

**కృష్ణయ్య:** మంచి మాటన్నావు!

**ఇల్లాలు:** 2. బాబూ! ఆవిడ బాధ చూడలేకుండా ఉన్నాను; ఆ మంత్రమేదో తొందరగా వేద్దూ!

**కృష్ణయ్య:** కందకు లేని దురద కత్తిపీటకు దేనికి చెప్పు!

**ఇల్లాలు:** 2. అలా కాదు నాయనా...! ఆవిడ అలా బాధ పడుతుంటే మనం చూస్తూ ఊరుకోవటం మర్యాదగా ఉంటుందా ?

**కృష్ణయ్య:** ఏమో...! నా కదంతా తెలియదు! అసలు నా మీద నమ్మకమే లేకపోతే నేనేం చేస్తాను ?

**ఇల్లాలు:** 2. ( ఇల్లాలు. 1. తో )
...చూడమ్మా...! ఇలా చూడు! మన కృష్ణయ్య మంత్రం వేస్తాడుట. ఒక్కసారి యిటు చూడు!

**కృష్ణయ్య:** ( వెఱ్ఱిగా నవ్వుతూ )
...మంత్రమంటే మంత్రంకా దత్తయ్యా; అదో చటకా; అంతే!

**ఇల్లాలు:** 2. అదేదో వెంటనే కానీయ్ నాయనా!

**కృష్ణయ్య:** ఏదీ ... యెలా వెయ్యను ? ఆవిడ 'అయ్యో ... అమ్మో...' అనటం మానితేనా!

**ఇల్లాలు:** 2. ( ఇల్లాలు. 1. తో )

**ఇల్లాలు:** 2. చూడమ్మా...ఒక్కసారి యిలా చూడు...!

**కృష్ణయ్య:** చూసినా చూడకపోయినా ఫరవాలేద త్తయ్యా...! 'అయ్యో...అమ్మో...!' అనే బదులు 'కృష్ణా...! కృష్ణా...!' అంటే చాలు; ఆ బాధ అమాంతంగా యెగిరి పోతుంది.

**ఇల్లాలు:** 2. ( ఇల్లాలు. 1. తో )

...అనమ్మా... అను...! ఒక్కసారి అను!

కృష్ణయ్య: ఒక్కసారి కాదు...ముఖ్యంగా మూడుసార్లనాలి!

ఇల్లాలు: 1. ...కృష్ణా...! కృ...అమ్మ బాబోయ్...!

కృష్ణయ్య: పోయింది. 'అమ్మ బాబోయ్' వచ్చిందిగా; కృష్ణా అన్న ఫలితం లేకుండా పోయింది. మళ్లీ అను!

ఇల్లాలు: 1. ...కృష్ణా...! కృష్ణా...కృ...అయ్యో...!

కృష్ణయ్య: (ఇల్లాలు 2. తో)

ప్చ్! మళ్లీ మురిగిపోయింది. ఇలా అయితే యేం లాభంలే దత్తయ్యా! బాధ మాట మరచి పోయి "కృష్ణా...! కృష్ణా ...! కృష్ణా ...!" అని ముఖ్యంగా మూడుసార్లు అనాలి. ఈలోగా 'అమ్మా! అయ్యా!' వచ్చారో ... నామంత్రం పనిచెయ్యదు. వింటున్నావా?

ఇల్లాలు: 2. ...అమ్మాయ్...! నా మాట విను! ముఖ్యంగా మూడుసార్లు అనాలిట. అనమ్మా ... అను!!

ఇల్లాలు: 1. ...కృష్ణా...! కృష్ణా...! కృష్ణా ...! కృష్ణా!"

కృష్ణయ్య: (చిలిపిగా నవ్వుతూ)

భేష్ భేష్...! చాలు. ఇహచాలు! ఏదీ...యిప్పుడు చెప్పు... బాధ యెక్కడుందో...!

ఇల్లాలు: 1. (అసలు బాధ అనేదే లేనట్టుగా)

...కృష్ణా...! ...కృష్ణా...!!...కృష్ణా...!!!

[ అంటూనే కృష్ణయ్యను కౌగిలించుకుంది. ఇల్లాలు. 2. అమితంగా సంతోషించింది. ]

కృష్ణయ్య: (మందహాసంచేస్తూ ఇల్లాలు. 1. తో)

...ఊఁ...ఇక మాట్లాడకుండా యింటికి వెళ్లు...! వింటున్నావా?

**ఇల్లాలు:** 1. అయ్యో... నా పెరుగు కుండ...?

**కృష్ణయ్య:** ప్చ్! పెరుగూ లేదు...కుండా లేదు...! పోదాం రా...!

[ అంటూ ఆవిడ చేయిపట్టుకుని బయటకు లాక్కువెళ్లాడు. ఇల్లాలు. 2. వాళ్లవంక అదోవిధంగా చూస్తూ నుంచుంది. ]



## ★ 4. వ ర ం గ ం ★

[ ఒక గోపిక తన యింట్లో పూజామందిరాన్ని అలంకరిస్తోంది. అంతలో కృష్ణయ్య లోపలకు వచ్చాడు. ]

గోపిక: ...రా బాబూ...! రా!!

కృష్ణయ్య: ( మందిరంవంక చూస్తూ )
...దేని కిదంతా ?

గోపిక: ...దేముణ్ణి పెట్టడానికి... !

కృష్ణయ్య: ...ఈ పువ్వులు దేనికి ?

గోపిక: ఆయనకు పూజ చెయ్యొద్దూ...! అందుకని...!

కృష్ణయ్య: ఓహో...అలాగా... ? అయితే సరే !

[ అంటూనే ఆమందిరం దగ్గరకు వెళ్లి దానిమీద కూర్చున్నాడు. ]

గోపిక: ...అయ్యయ్యో...తప్పు తప్పు !

కృష్ణయ్య: ఏం... ? ఇది దేముఁడి కోసం అన్నావుగా ! అందుకే కూర్చున్నాను !
ఊఁ...చెయ్...! పూజ చెయ్ !!

గోపిక: ( నవ్వుతూ )
...ఐతే, నువ్వు దేముడివా... ?

కృష్ణయ్య: ఆఁ...! కాక బోతే... ?

గోపిక: ( చిలిపిగా )
...దేముడివైతే వరాలివ్వాలి ; తెలుసా ?

కృష్ణయ్య: ఓ...! దానికేం ? భేషుగ్గా యిస్తాను. ఏం కావాలో అడుగు ! ఊఁ...! అడుగు !!

[ గోపిక సిగ్గు పడ్డది. ]

అడగా లనుకున్నప్పుడు అడగాలి గాని సిగ్గు పడతారా ? ఊఁ...! అడుగు !!

[ గోపిక ముసిముసి నవ్వులు నవ్వుతుంది. ]

కృష్ణయ్య: ( చిరునవ్వుతో... )
...ఆఁ... తెలిసింది; నాకే తెలిసింది. నీకోరిక ఏమిటో
నాకు పూర్తిగా తెలిసి పోయింది!

గోపిక: ( అతని కళ్లల్లోకి చూస్తూ )
...ఏమిటది...? చెప్పు...చూద్దాం!

కృష్ణయ్య: ...చెప్పనా...? చెప్పనా...? చెబితే యేమిస్తావ్?
[ గోపిక సిగ్గుతో తలవంచుకుంది. ]
ఊఁ...చెప్పు!

గోపిక: ...ఏం కావాలంటే అది...!

కృష్ణయ్య: ( చిలిపిగా )
నిజంగానా...? మళ్లీ మాట తప్పితే మర్యాదగా
ఉండదమ్మాయ్...ముందే చెబుతున్నా!

గోపిక: ( అమితమైన లజ్జతో )
... ఊఁ ...!

కృష్ణయ్య: ( రహస్యంగా )
నువ్వు దేముడి పెళ్లానివి కావా లనుకున్నావు!
అంతేనా?

[ గోపిక ముఖం సిగ్గుతో జేవురించింది. అంతలో అక్కడ
వ్రేలాడుతున్న గంటలు వాటంతట అవే మ్రోగినై. ]

గోపిక: ( తన్మయత్వంలో )
...కృష్ణా...! కృష్ణా...! కృష్ణా...!!

[ అలా అంటూనే ఆవిడ మూర్ఛపోయింది. కృష్ణయ్య మంద
హాసంచేస్తూ ఆ మందిరంలోంచి బయటకు వచ్చి ఆమెను
ముద్దు పెట్టుకున్నాడు.
వెంటనే గోపిక కళ్లు తెరచింది. 'కృష్ణా...కృష్ణా!' అంటూ అతణ్ణి
హృదయానికి హత్తుకుంది.
కృష్ణయ్య చిలిపిగా చిరునవ్వు నవ్వాడు. ]



## ★ 5. వ ర ం గ ం ★

[ ఇద్దరు గొల్ల పిల్లలు ఒక చెట్టు క్రింద కూర్చున్నారు. వారికి దగ్గరలోనే, ఓ ప్రక్కగా, ఆవులూ దూడలూ మేత మేస్తున్నై. ఆ చెట్టు వెనుక కృష్ణయ్య నుంచున్నాడు. ]

గోపకుడు: ...నువ్వు నూరు చెప్పు వెయ్యి చెప్పు; వాడు దేముడూ కాదు, దయ్యమూ కాదు ; ఉట్టి మాయ మనిషి.

2. ఏమిటి... ? పూతనను చంపటం మాయే నంటావా ?

1. ఆ !

2. శకటాసురుణ్ణి చంపటం ?

1. అంతే !

2. ఆ గాలి రాక్షసుణ్ణి చంపటం కూడా...

1. అదీ అంతే ! వాడు మాయచేసి వాళ్లందరినీ చంపేశాడు. అంతే కాదు ; మనమీాదకూడా మచ్చుమందు చల్లేశాడు.

2. అంటే... ?

1. ఏముంది ? వాడు యే చిన్నపని చేసినా మనం 'భేష్ భేష్ !' అంటున్నాం. వాడు నవ్వితే చాలు 'హాయ్ హాయ్ !' అంటున్నాం. వాడు యేడుపు మొహం పెట్టాడూ అంటే, మనం, కొంప కూలిపోయినట్టుగా 'అయ్యో ! అమ్మో !" అని యేడుస్తున్నాం. ఇదంతా యేమి టనుకున్నావ్ ? మాయ ; అంతా మాయే !

[ చెట్టు వెనుక ఉన్న కృష్ణయ్య 'నీకుని చెబుతానుండు !' అన్నట్టుగా తల ఆడించాడు. 'మాయ... మాయ ' అంటూనే ఆ కుఱ్ఱవాడు మత్తుగా వాలిపోయినాడు ]

2. అరెరె... ! మాట్లాడుతూనే పడిపోతున్నావే... ! ఇదీ మాయేనా ?

1. ( వత్తులో మునిగిపోతూ )

...ఆఁ...మాయేరా...! అంతా మాయే...!!

2. ( ఆపులించి )

ఐతే అనుమానం దేనికి ...? అంతే అయుంటుంది! అంతే!!

[ ఆలా అంటూ ఉండగానే ఆ యిద్దరూ ఒకరిమీద ఒకరు వాలిపోయినారు. కృష్ణయ్య వాళ్లను చూసి చిలిపిగా నవ్వు కున్నాడు. ఆ వెంటనే ఆ ప్రక్కన ఉన్న ఒక దూడను ఆ చెట్టు దగ్గరకు లాక్కొని వచ్చాడు. అంతకు ముందు తనను విమర్శించిన పిల్లవాడి జుట్టును ఆ దూడ తోకకు ముడేశాడు. ఆ తరువాత దూడ వీపు మీద ఒక్క చరుపు చరిచాడు.

దాంతో ఆ దూడ 'కుయ్యో! మొఱ్ఱో!' అని అరుస్తున్న ఆ కుఱ్ఱవాణ్ణి, ఈడ్చుకుంటూ పరిగెత్తింది.

ఆ కేకలు విని రెండవ పిల్లవాడు లేచాడు. లేచి, అటూ యిటూ చూసి తన స్నేహితుని వెనుక అరుస్తూ వెళ్లాడు.

అదంతా చూస్తున్న కృష్ణయ్య కొంటెగా నవ్వాడు; వాళ్లకు కనబడకుండా తప్పుకుంటూ తారుతూ అక్కడినుంచి వెళ్లిపోయినాడు. ]



## ★ 6. వ ర ం గ ం ★

[ గోపికలు కొందరు ఒకచోట గుసగుస లాడుకుంటున్నారు. ]

గోపిక: 1. ...ఏం కుట్టాడో యేమో నమ్మా! చూస్తే జానెడు లేడు; చేష్టలు చెప్పటానికి వీలు లేకుండా ఉన్నై.

2. ...అదేమిటో గాని, అతను యేపని చేసినా అంతే. పాలూ పెరుగూ యెక్కడున్నా సరే తన కోసమే అనుకుంటాడు. వెన్న దొంగిలించటంలో అతనిది పెట్టింది పేరు. ఎలా వస్తాడో యేమో యెవరికీ తెలియదు; వేసిన తాళాలు వేసినట్టే ఉంటై; యిళ్లల్లో ఉన్న కుండలు మాత్రం యిట్టె 'ఖాళీ' అయిపోతై. అదేమిటి చెప్పు!

3. అంతే కాదమ్మా! వాళ్లింట్లో ఆడుతూ ఉంటాడు, వీళ్లింట్లో పాడుతూ ఉంటాడు. మీా యింట్లో మాట్లాడుతూ ఉంటాడు; మా యింట్లో పోట్లాడుతూ ఉంటాడు. ఒకే ఒక సమయంలో యిన్ని పనులూ చేస్తాడు. అదేమనాలో అర్థం కాకుండా ఉంది.

4. ఏమైనా గానీ...

"కడు లచ్చి కలిగా నేనిం
గుడుతురు గట్టుదురు గాక కొడుకుల నగుచున్,
బడుగుల వాడలపై బడ
విడుతురె రాకాంత లెందు* విశ్వమునందున్"

1. ...ఎవ రనుకున్నా యిదే మాట! ఎవరు పడ్డా యిదే బాధ! ఏం చేస్తాం?

2. ఏం చేస్తామని ఊరుకుంటే యేమవుతుంది? ఈ విషయాన్నే ఆవిడకు చెప్పకుందాం!

3. ఎవరికి... ? యశోదమ్మకా... ?
2. ఆఁ...ఆవిడకే! ఔనన్నా కాదన్నా ఆవిడేగా! మన గీత బాగుంటే అతణ్ణి అదుపాజ్ఞల్లో ఉంచుకుంటుంది; లేదా లేదు; యేమంటావ్ ?
1. నిజమే. మనంతట మనం చేసేదేముంది ?
2. సరే; పోదాం పదండి!



# ★ 7. వరంగం ★

[ అది నందుని యిల్లు. యశోద ఒక ఆవుకు పసుపూ కుంకుమా పెడుతూ గొడ్ల సావిట్లో ఉంది. అంతలో గోపికలు అక్కడకు వచ్చారు. ]

యశోద: ...రండమ్మా...రండి !
...ఇదేమిటి...ప్రొద్దున్నే యిలా వచ్చారు ?

గోపిక: 1. రాక యేం చేస్తామమ్మా ?... బ్రతుకులు బయట పడ్డ తరువాత యిళ్లల్లో ఉండే పనేముంది ?

యశోద: ... అదేమిటమ్మా ? అదేం మాట ?

గోపిక: 2. ఔనత్తయ్యా ! కమ్మగా కాపురాలు చేసుకునే గీత మా ముఖాన ఉంటేగా !

యశోద: ... ఇంతకూ యిప్పుడు ...

గోపిక: 3. ఏముంది ? మా బ్రతుకు లన్నీ బండలై పోతున్నై. క్రొత్త కాపురాలన్నీ కూలిపోతున్నై. ఇంతకంటె యేం కావాలి ?

యశోద: అయ్యయ్యో ... అదేం అన్యాయం ... ?

గోపిక: 4. అన్యాయమా మరీ అన్యాయమా ! గోడల మధ్య ఉండే జీవితాలు వాడలు దాటిపోతున్నై. ఐనా యేం చేస్తాం ?

యశోద: ఇంతకూ యెవరేం చేస్తున్నారూ అని ?

గోపిక: 5. ఎవరో అయితే యింత బాధ దేనికి ; యెప్పుడో బయటపెట్టి బాగుపడే వాళ్లం ! రాచబిడ్డ కాబట్టే దాచి దాచి యివ్వాళ యిలా వచ్చాం !

యశోద: ... ఆఁ ... !

గోపిక: 6. ...ఔనమ్మా...నిజం! మీవాడే దీనంతకూ మూలం !

యశోద: ... మా వాడా... ?

గోపిక: 1. ఔనత్తయ్యా ! ఆయనే... ! మన కృష్ణయ్యే !

6. " ఓ యమ్మ నీ కుమారుడు
మా యిండ్లను బాలు బెరుగు మననీడమ్మా
పోనీయద మెక్కడి కైనను
మా యన్నల సురభులాన మంజులవాణీ "

యశోద: ... అదేమిటమ్మా ... అభం శుభం తెలియని అబ్బాయి మీద అభాండాలు వేస్తున్నారు?

గోపిక: 5. ఊఁహూ! ఉట్టి వెట్టి బాగులవాడు!

[ గోపిక లందరూ నవ్వారు. ]

4. పాపం...నోట్లో నాలిక కూడా లేదు!

[ గోపికలు తిరిగి నవ్వారు. ]

6. నాలిక కూడా లేదు కాబట్టే...

[ ఏదో అనబోయి నాలిక కొరుక్కుంది. ]

5. ... ఊళ్లో ఉన్న పాలూ పెరుగూ 'ఉఫ్' అని ఊదేస్తున్నాడు!

[ తిరిగి గోపిక లందరూ కకకకలాడారు. ]

యశోద: చూడండమ్మా ...! ఇలా ఆడిపోసుకోవటం ...

గోపిక: 4. ఊఁహుఁ! ... అన్యాయం అంటారు; అంతేనా?

6. ... అబ్బాయికి అల్లరంటే తెలియదు; అమ్మకు అన్యాయ మంటే తెలియదు!

[ గోపికలు కిల కిల లాడారు. ]

యశోద: హరి హరీ! ఏం మాటమ్మా యిది?

" చన్ను విడిచి యిట్టిటు చన
డెన్నడు పొరుగిండ్ల త్రోవ లెరుగడు; నేడుం
గన్నులు దెఱవని మా యీ
చిన్ని కుమారకుని అవ్వ సేయం దగునే "

[ గోపికలు ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. ]

గోపిక: 5. అంతే కాదు....

"అన్య మెరుగడు తన యంత నాడుచుండు
మంచి వా డీతడు......"

[ అని, యశోదను అనుకరించ సాగింది. ఆమె హేళన చేస్తోం దన్న భావం యశోదకు కలగ లేదు. ]

యశోద: అందుకనే బ్రతిమాలుకుంటున్నాను...

"...ఎగ్గులు మానరమ్మ!
రామలార! త్రిలోకాభిరామ లార!
తల్లులార! గుణవతీమ తల్లులార!!"

[ అదివిన్న గోపికలందరూ విరగబడి నవ్వారు. అంతలో రోహిణి అక్కడకు వచ్చింది. వాళ్ల మాటలు విన్నది. వాళ్లనవ్వు చూసింది. నిర్ఘాంతపోయి నుంచుంది. ]

గోపిక: 4. ఉహుఁ! ఇందుకే, గాబోలు నిజం చెబితే నిష్ఠూరం అంటారు!

5. ...ఇప్పుడైనా తెలిసిందా? ఉన్నవాళ్లు యేమన్నా ఉపదేశ మౌతుంది; లేని వాళ్లు యేం చెప్పినా లేకి మాటే అవుతుంది. ఇదీ ప్రపంచం!

[ అంతలో బలరాముడూ మరొక గోప బాలుడూ పరుగు పరుగున వచ్చారు. ]

బలరాముడు:

... అమ్మా ... అమ్మా ...!!

రోహిణి: ఏం నాయనా ...! ఏమయింది ...?

బలరాముడు:

మన కృష్ణయ్య మన్ను తిన్నాడమ్మా...మన్ను!

గోపబాలుడు:

నిజం పిన్నీ! నిజం!

యశోద: ... మన్ను తిన్నాడా?

గోపబాలుడు:

అఁ! దోసిళ్లతో తీసుకుని నోట్లో పోసుకున్నాడు!

గోపిక: 6. ఊఁహూ ! ఊళ్లో ఉన్న వెన్న చాల్లేదు కాబోలు...
మన్నుపని పట్టించాడు !

[ గోపిక లందరూ గొల్లుమని నవ్వారు. బలరాముని వెనగ్గా పరిగెత్తుకుంటూ వచ్చిన కృష్ణయ్య తలుపు దగ్గర ఆగిపోయి నాడు ; వాళ్ల అల్లరి గ్రహించి నట్టుగా తల పంకించాడు. ]

యశోద: ఎక్కడున్నాడు నాయనా... ! వాడు యిప్పు డెక్కడున్నాడు ?

బలరాముడు: ( వెనుదిరిగి, అక్కడే ఉన్న కృష్ణయ్యను చూపుతూ )
... అడుగో ... !

[ యశోద అటుగా చూసింది.

కృష్ణయ్య, ముఖం చిన్నది చేసుకుని ఆవిడ వేపుగా వెళ్లాడు. ]

యశోద: ... కృష్ణయ్యా... ! అల్లరికైనా అంతులేదా నాయనా ?

" మన్నేటికి భక్షించెదు
మన్నియమను లేల నీవు మన్నింపవు మీ
యన్నయు సఖులును చెప్పెద
రన్నా మన్నేల మరి పదార్థము లేదే "

కృష్ణయ్య: ( కన్నీరు పెట్టుకుంటూ )
ఉట్టిదమ్మా ! అంతా ఉట్టిది !!

యశోద: అన్నయ్యలు అబద్ధ మాడుతారా ?

కృష్ణయ్య: " అమ్మా ! మన్ను దినంగ నే శిశువనో
యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరి మాటలు మదిన్
నన్నీవు గొట్టంగ దా

రిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా
దేనిక్ మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్
దప్పైన దండింపవే !"

[ ఆ మాట అంటూనే కృష్ణయ్య యేడవటం మొదలు పెట్టాడు.
అది చూసిన గోపికలు అతనిపట్ల సానుభూతి చూపారు. ]

యశోద: ఊఁ ... యేదీ...? నోరు చూపించు!

[ కృష్ణయ్య 'ఆఁ...' అని నోరు తెరిచాడు.
అంతలో పెద్ద తుపానుగాలి వచ్చినంత మోత అయింది.
సముద్రతరంగాల ధ్వని వినిపించింది. ఒక్కసారిగా వెయ్యి
మెఱుపులు వచ్చినంత వెలుగు వారిని కప్పేసింది. ]

అరెరె...! ఏమిటిది? ఏమిటీ విచిత్రం?

"కలయో వైష్ణవమాయయో యితర సం
కల్పార్థమో సత్యమో
తలపన్ నేరకయున్నదాననో యశో
దాదేవి గానో పర

స్థలమో బాలకుడెంత యీతని ముఖ
స్థం బై యజాండంబు ప్र
జ్వలమై యుండుట కేమి హేతువో మహా
శ్చర్యంబు చింతింపగన్"

కృష్ణా...! కృష్ణా...! నువ్వు లీలామానుష విగ్ర
హుడవు నాయనా! ... ఆహాహా...! అదే కాక
పోతే...

"బాలమాత్రుడైన బాలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు?"

[ "కృష్ణా ... ! కృష్ణా!" అంటూనే అతణ్ణి కౌగిలించుకుంది. ]

రోహిణి: ఉఁహుఁ! ఇంకా సందేహమా ... ?

"బాలుభంగి నితడు భాసిల్లు గాని స
ర్వాత్ము డాది విష్ణు డగుట నిజము!"

[ అంటూనే పరమాత్ముని తలచుకుని నమస్కరించింది.
గోపిక లందరూ కూడా అలాగే చేశారు. ]

యశోద: ( తన్మయత్వంతో )

"ఏ మహాత్ము వలన నీ విశ్వ మంతయు
గాన బడిన బుద్ధి కంప మయ్యె
నా మహాత్ము నతని నఖిల లోకాధారు
నార్తు లెల్ల బాయ నాశ్రయింతు"

కృష్ణయ్య: ( చిరునవ్వుతో )

...అమ్మా!... అమ్మా ...!!

యశోద: ... కన్నారీ ...!

[ తిరిగి గుండెకు హత్తుకుంది. ]

గోపికలు: ...కృష్ణా! నిన్ను తెలుసుకోలేక యేమేమో అన్నాం. నీ మీద యెన్ని నిందలో మోపాం. క్షమించు నాయనా.. ! మమ్మల్ని క్షమించు; తండ్రీ!!

[ గోపిక లందరూ పశ్చాత్తాపంతో కృష్ణునిముందు సాష్టాంగ పడ్డారు. ]

యశోద: ఏమిటమ్మా యిది? చిరంజీవికి చేతులెత్తి నమస్కరిస్తారా? అయ్యయ్యో ... యెంత తప్పు... యెంత తప్పు!!

[ అది విన్న కృష్ణయ్య గోపికల వంక చూసి చిలిపిగా నవ్వాడు.
బలరాముడు ....

"హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే..." అంటూ, సంతోషంతో యశోదనూ కృష్ణయ్యనూ చుట్టి తిరగటం మొదలు పెట్టాడు.
గోపిక లందరూ అతనితోపాటు భజన చేయసాగారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. నందుడు
4. ఉపనందుడు

# యమళార్జున భంజనం

## ★ 1. వ ర ం గ ం ★

[ యశోద కృష్ణయ్యకు అన్నం కలిపి పెడుతోంది. కృష్ణయ్య బుంగమూతి పెట్టుకుని అదో విధంగా ఆమెవంక చూస్తున్నాడు. ]

యశోద: ... నా కన్నారి కదూ! నా చిన్నారి కదూ! నా బుజ్జాయి నా మాట వింటాడమ్మా? ఈ ముద్దకూడా తింటాడమ్మా! ఏదీ ...? ... గోరుగుజ్జు ... గోరు గుజ్జు ...!!

[ అది తినటం తనకు యిష్టం లేనట్టుగా కృష్ణయ్య వెనక్కు వాలాడు. ]

... ఒక్క ముద్ద ...! ఒక్క టంటే ఒక్కటే! ఇదొక్కటేగా ...!

( కళ్లు మూసుకుని )

ఎవరు తింటారో ... ఇెవరు తింటారో ... నా రత్నాల హారం తింటుందో ...! నా ముత్యాల పేరు తింటుందో ... నా వరహాల మూట తింటుందో ... యెవరు తింటారో ... యెవరు తింటారో!

కృష్ణయ్య: ఊహుఁ! ఒద్దమ్మా ...! నాకు ఆకలిగా లేదు!

( ఓ ప్రక్కకు వంగి చూసి )

అరెరె...! పాలమ్మా...పాలు! పొంగిపోతున్నై!

[ ఆ మాట విన్న యశోద, చేతులో ఉన్న ముద్దను కంచంలో పడేసి, గబగబా లోపలకు వెళ్లింది. అది చూసిన కృష్ణయ్యకు యెక్కడలేని నవ్వూ వచ్చింది. కాని, అతను దాన్ని పైకి రానియ్య లేదు. ]

ఆ వెంటనే కృష్ణయ్య అక్కడే ఓ ప్రక్కగా ఉన్న వెన్నకుండ దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి, అందులో ఉన్న వెన్న నంతనూ గబగబా నోట్లో కుక్కుకున్నాడు. చివరకు ఆ కుండను పగులగొట్టి కుండ పెంకులకు అంటుకుని ఉన్న వెన్నను కూడా పూర్తిగా నాకేసాడు ; ఆ వెంటనే వాకిట్లోకి పరిగెత్తాడు.

అంతలో యశోద అక్కడకు వచ్చింది. కృష్ణయ్య అక్కడ లేకపోవటం చూసింది ; నిట్టూర్చింది. అంతలో పగిలిపోయిన వెన్నకుండ ఆవిడ కళ్ళబడ్డది.

అదిచూసిన యశోద నివ్వెరపోయింది. ఆమెకు అర్థ మయింది; కృష్ణయ్య వేసిన ఎత్తు. అందుకే ఆవిడ తల పంకించింది ; అక్కడే చూరులో ఉన్న సెలగోల తీసుకుంది ; గబగబా బయటకు వెళ్ళింది. ]



# ★ 2. వ రంగం ★

[ ఒక గోపిక పూజామందిరం ముందు కూర్చుని మౌనంగా ప్రార్థన చేసుకుంటోంది.

అదే సమయంలో, కృష్ణయ్య ఆ యింట్లో ప్రవేశించాడు. దొంగ మాదిరి అడుగుల్లో అడుగులు వేసుకుంటూ పాలగది వేపుగా వెళ్లాడు. ]



## ★ 3. వరంగం ★

[ అది పాలగది. కృష్ణయ్య ఆగదిలో ప్రవేశించి నాలుగు మూలలా చూశాడు.

అక్కడ కుండలన్నీ ఉట్లమీద పెట్టి ఉన్నై. వాటిని అందు కోవటం యెలాగా అన్న ఆలోచన కృష్ణయ్యకు కలిగింది. అందు కనే ఒక క్షణం ఆలోచించాడు. ఆలోచించి, వెంటనే అక్క డున్న పీటలు తెచ్చి ఒక దాని మీద ఒకటి పేర్చాడు. వాటిని మెల్లగా ఉట్టి క్రిందికి తోశాడు. ఆ తరువాత ఒడుపుగా వాటి మీదకు యెక్కాడు.

అలా పీటలమీద నుంచుని, ఒక కుండను అందుకోవాలని కృష్ణయ్య ప్రయత్నించాడు; కాని, లాభం లేకపోయింది. అప్పుడు కృష్ణయ్య 'యిక యేం చేయాలి?' అన్న ఆలోచనలో పడ్డాడు. అంతలో, అక్కడే ఓ మూల ఉన్న రోలు అతనికి కనిపించింది. అది చూడగానే అతనికి అంతులేని ఆనందం కలిగింది.

ఆ వెంటనే, కృష్ణయ్య, ప్రక్కగదిలో ఉన్న గోపిక వంక, ఓ సారి, తొంగి చూశాడు; ఆ తరువాత వేళ్ళమీదనడుస్తూ ఆ రోటి దగ్గరకు వెళ్ళాడు. వెళ్ళి, దాన్ని జాగ్రత్తగా ఒరగేసి పీటల దగ్గరకు దొర్లించుకుంటూ వచ్చాడు. మరుక్షణంలో దాన్ని యెత్తి పీటలమీద నిలబెట్టాడు.

ఆ తరువాత కృష్ణయ్య మెల్లమెల్లగా, ఒడుపుగా, ఆ రోటిమీద యెక్కాడు. అప్పటికి వెన్నకుండ అతని అందుబాటులోకి వచ్చింది. అది గ్రహించిన కృష్ణయ్య సంతృప్తితో చిరునవ్వు నవ్వాడు. కుండలోకి చేయిపోనిచ్చి అందులో ఉన్న వెన్నను తీసుకు తినటం మొదలుపెట్టాడు.

ఆ గదిలోనే ఓ మూల ఒకపిల్లి నక్కి ఉంది అది ఉట్టి వంకా కృష్ణయ్య వంకా ఊరిక్కే చూస్తూ కూర్చుంది. అది యెంత సేపు అలా చూసినా దానికోరిక తీరేటట్టు కనపడలేదు. వెన్న ముద్దలన్నింటినీ కృష్ణయ్య తినటమే జరుగుతోంది గాని, దాని ముందు ఒక్క పిసరంత అయినా పడవేయటం జరగలేదు.

అందుకనే ఆ పిల్లికి ఉక్రోషం వచ్చింది. వచ్చి, 'మ్యావ్... మ్యావ్' అని అరిచింది.

ఆ అరుపు విన్న కృష్ణయ్యకు అప్పు డర్థమయింది; ఆ గదిలో ఒక పిల్లికూడా ఉన్నదీ అని. అతను దానివంక చూశాడు. దాని అరుపు విని గోపిక లోపలకు వస్తుందేమో అని భయపడ్డాడు. అందుకనే దాని నోరు మూయాలని, తన చేతులో ఉన్న వెన్నముద్దను దాని ముందు పడేసాడు. అంతే; దాని అరుపు ఆగిపోయింది; అతని భయం తీరిపోయింది.

ఆ వెంటనే కృష్ణయ్య తిరిగి తనపనిలో తాను నిమగ్నుడై నాడు. ]



## ★ 4. వరంగం ★

[ యశోద అప్పుడే ఆ యింటికి వచ్చింది. వచ్చి, సావిట్లో పూజ చేసుకుంటున్న గోపికను గమనించకుండానే "కృష్ణా! కృష్ణా!" అని బిగ్గరగా పిలిచింది.

పూజ చేసుకుంటున్న గోపిక ఆ పిలుపు విన్నది. విని, కళ్లు తెరచి యశోద వంక చూసింది. ]

**గోపిక:** ... లే దత్తయ్యా! ... ఇక్కడ లేడు!!

**యశోద:** ( నిట్టూర్చి )

... ఉఁహుఁ! ఏ ఊరు యేలడానికి వెళ్లాడో?

[ ఆ మాట అంటూనే ఆమె వెనక్కు తిరిగింది. ]



## ★ 5. వరంగం ★

[ పాలగదిలో ఉన్న కృష్ణయ్య తల్లిగొంతు గుర్తుపట్టాడు; కొంచెంగా భయపడ్డాడు.

అంతలో, పిల్లి, 'మ్యావ్... మ్యావ్' అని అరిచింది. అది విన్న కృష్ణయ్య 'ఇస్ .....ష్!' అని దాన్ని అదలించాడు.

అతని మాటను లక్ష్యం చేయకుండా ఆ పిల్లి అదేపనిగా అరవటం సాగించింది. అది చూసిన కృష్ణయ్యకు యేంచేయటానికీ పాలు పోలేదు. అందుకనే దాని వంక చూస్తూ అలాగే ఉండి పోయి నాడు. ]



## ★ 6. వ రం గం ★

[ సావిట్లో ఉన్న గోపిక ఆ పిల్లి అరవటం విన్నది; వినీ వినటం తోటే పాలగదిలోకి పరిగెత్తింది. ]

గోపిక: ( లోపలకు వెడుతూ )

... అబ్బ ... ! ఈ పిల్లులతో బ్రతకలేకుండా ఉన్నాం ; అత్తయ్యా !

[ ద్వారం వరకూ వెళ్లిన యశోద ఆ మాట విని ఆగింది ; గోపిక వంక సానుభూతితో చూసింది. ]



## ★ 7. వరంగం ★

[ పాలగదిలో ఉన్న కృష్ణయ్య మెల్లిగా రోటి మీదినుంచి దిగ బోతున్నాడు. ఆ సమయానికే గోపిక అక్కడకు వచ్చింది. వచ్చీ రావటం తోటే కృష్ణయ్యను చూసింది; నివ్వెఱ బోయి నిలబడ్డది.

దొంగతనం బయట పడ్డదే అన్నట్టుగా కృష్ణయ్య తలవంచు కున్నాడు. గోపిక అది గ్రహించి చిరునవ్వు నవ్వింది. ఆ వెంటనే ఆ విడ, సావిట్లోఉన్న యశోదకు సైగచేసింది; ఓ సారి అటు రమ్మని.

యశోద గోపికను సమీపించింది; కొడుకును చూసింది; ఆశ్చర్య పోయింది.

కృష్ణయ్యవంకా యశోదవంకా చూస్తూ గోపిక పకపకా నవ్వింది.

కృష్ణయ్య వాళ్లిద్దరినీ చూశాడు. భయపడుతున్న వాడి మాదిరిగా రోటి మీంచి దిగి, అడుగుల్లో అడుగులు వేసుకుంటూ వాళ్ల వేపు వెళ్లాడు. ]

యశోద: ( కృష్ణయ్యను ఉద్దేశించి )
... ఊఁహుఁ !

" వీ రెవ్వరు శ్రీకృష్ణులు
కారా యెన్నడును వెన్న గానరట కదా
చోరత్వం బించుకయును
నేరరట ధరిత్రి నిట్టి నియతులు గలరే ? "

[ అది విన్న కృష్ణయ్య ఒక సారి తలెత్తి తన తల్లివంక చూసాడు. అతని కళ్లు నీళ్లతో నిండిపోయినై; పశ్చాత్తాప పడుతున్నట్టు కనిపించాడు.

అది చూసిన యశోద ఓ ప్రక్కగా తొలిగి నుంచుంది.

కృష్ణయ్య మెల్లమెల్లగా వాళ్ళను సమీపించాడు. ఒక్క క్షణం వాళ్ళముందు ఆగాడు.

యశోదా గోపికా, అతనిమీద సానుభూతి చూపుతూ, ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

కృష్ణయ్య వాళ్ల వంక ఓరగా చూశాడు. చూసి, వాళ్ల చూపులు తన మీద లేవని గ్రహించాడు. ముసి ముసి నవ్వులు నవ్వు కున్నాడు; మరుక్షణంలో వాళ్ల మధ్య నుంచి 'తుఱ్ఱు' మని దూసుకుపోయినాడు.

అలా పరిగెత్తుకు పోతున్న కృష్ణయ్యను చూసి గోపిక విరగబడి నవ్వింది. యశోదకు కృష్ణయ్యమీద కొంచెం కోపం వచ్చింది. ]

యశోద: ... కృష్ణా ... ! కృష్ణా ... ! !

[ కృష్ణయ్య ఓ సారి ఆవిడవంకచూసి గిఱ్ఱున తిరిగి పారి పోయినాడు. ]



## ★ 8. వ రం గం ★

[ కృష్ణయ్య ఒక వీధిలో పరిగెత్తుకు పోతున్నాడు. యశోద అతణ్ణి పదేపదే పిలుస్తూ అతని వెనకాల వెడుతోంది; గోపిక ఆమెను అనుసరిస్తోంది.

అటు తిరిగి యిటు తిరిగి కృష్ణయ్య యశోద చేతులో చిక్కాడు. ]

యశోద:: ( గోపికతో )

... చూశావా అమ్మా! ఈయనతో ... రోజూ నా కిదే పని!

" బాలు డీతండని భావింతు నందునా
యే పెద్దలును నేర రీ క్రమంబు
వెఱ పెఱుంగుటకునై వెఱపింతు నందునా
కలిగి లే కొక్కడు గాని లేడు
వెఱపుతో నా బుద్ధి వినిపింతు నందునా
తను దానయై బుద్ధి దప్పకుండు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
చొచ్చి చూడని దొక చోటు లేదు
తన్ను నెవ్వారైన దలపోయ బాటెడి
యోజలేదు భీతి యొకటి యెఱుగ
డెలమి నూర కుండ డెక్కసక్కెము లాడు
బట్టి శాస్తి చేయు భంగి యెట్లు "

గోపిక: ( చిరునవ్వుతో )

... చిన్నతనం అత్తయ్యా ...! ఏం చేస్తాం?

యశోద: ఏం చేస్తామని ఊరుకుంటే యెలాగమ్మా?

గోపిక: అలా అని తిడతామా కొడతామా?

యశోద: ఏదో ఒకటి చెయ్యాల్యలమ్మా! శిక్షించక పోతే చిన్న పిల్లలు చెడిపోరూ?

[ అది విన్న కృష్ణయ్య యేడుపు మొహం పెట్టాడు. అతణ్ణి చూసిన గోపికకళ్లు చెమ్మ గిలిసై. ]

కృష్ణయ్య: ... చేసింది తప్పేనమ్మా! తప్పే చేశాను ...! ఇంకెప్పుడూ యిలా చెయ్యను!

యశోద: ఉఁహూఁ! ఇది నీకు పాత పాటేగా!

" ఎక్కడ నైనను తిరిగెద
వొక్క యెడన్ గుణము గలిగి యుండవు నియమం
బెక్కడిది నీకు మరచిన
జక్కన బోయెదవు పెక్కు జాడల *నౌరా! "

కృష్ణయ్య: కాదమ్మా; అలా కాదు! నిజం చెబుతున్నాగా!

యశోద: ఉఁహూఁ! నీ విషయంలో నిజమేదో అబద్ధమేదో నాకు తెలిస్తేగా!

" తోయంబు లివియని తొలగవు చొచ్చెదు
తలచెదు గట్టైన దరల నెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
దున్నత స్థంభంబు లూప బోయె
దన్యుల నల్పంబు లడుగంగ బారెదు
రాచ వేటల జాల అవ్వ దెచ్చె
దలయవు నీళ్లకు నడ్డంబు గట్టెదు
ముసలివై హరి వృత్తి మొనయ జూచె
దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింక గల్కితనము లేల *నీకు
నిన్ను వంప వ్రాల్ప నే నేరననియొ నీ
విట్లు క్రిందు మీదు నెఱుగ కునికి "

ఏమైనా సరే; యిక నిన్ను వదిలేది లేదు.

గోపిక: ఈసారికి వదిలై అత్తయ్యా; ఇహ అలా చెయ్య నంటున్నాడుగా!

యశోద: ... నువ్వు ఉండమ్మా ... నీకేం తెలియదు!

[ ఆమాట అంటూనే యశోద యింట్లోకి వెళ్లింది.

ఆ వెంటనే, కృష్ణయ్య, కల్ల బొల్లి ఏడుపులతో గోపికను చుట్టేసు కున్నాడు. ]



# ★ 9. వ రంగం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:**

... ఆ విధంగా కృష్ణయ్యను అక్కడ వదిలి పెట్టి లోపలకు వెళ్లిన యశోద వెంటనే ఒక త్రాడు తెచ్చింది. ఆ త్రాటితో కృష్ణయ్యను కట్టేయాలని ఆవిడ అభిప్రాయ పడ్డది; అలాగే ప్రయత్నించింది కూడా.

యశోద యెంతగా ప్రయత్నించినా ఆ త్రాడు కృష్ణయ్య బొజ్జకు ఒక చుట్టు కూడా తిరగలేదు; రెండంగుళాలు తక్కువయింది.

యశోద తిరిగి లోపలకు వెళ్లి మరో త్రాడు తెచ్చింది. దాన్ని మొదట తెచ్చినదానికి ముడేసింది. అప్పుడయినా అతణ్ణి కట్టలేక పోతానా అనుకుంది; అలాగే ప్రయత్నం చేసింది. కాని, ఆ రెండు త్రాళ్లూ కలిసి కూడా కృష్ణయ్యను కట్టలేక పోయినై. తిరిగి రెండే రెండు అంగుళాల పొడవు తక్కువయిం దనిపించింది. అది చూసిన యశోదా గోపికా ఆశ్చర్య పడ్డారు. కృష్ణయ్య తనలో తాను నవ్వు కున్నాడు.

అప్పటికి మరి కొందరు గోపికలు కూడా అక్కడికి వచ్చారు. వాళ్లందరూ అదంతా ఆశ్చర్యంతో చూడసాగారు.

ఆ తరువాత...

"తజ్జనని లోగిటం గల
రజ్జు పరంపరల గ్రమ్మఱిం సుతు గట్టన్
బొజ్జ తిరిగి రాదయ్యె జ
గజ్జాలము లున్న బొజ్జ గట్టన్ వశమే"

అది చూసిన గోపికలు 'యిదేమిటం'టే 'యిదేమిటి' అనుకున్నారు. అందరకూ అదో వింతగా తోచింది.

అప్పటికి యశోద బాగా బడలిపోయింది. ఆమె ఆశయం సిద్ధిస్తుందన్న ఆశ ఆమెలో క్షీణించి పోయింది.

నల్లనయ్య అదంతా గ్రహించాడు. అమ్మను బాధ పెట్టడం అన్యాయం అనుకున్నాడు. అందుకనే...

"బంధ విమోచను డీశుడు
బంధింప బెనంగు జనని బాలార్చి సుహృ
ద్బంధుడు గావున జననీ
బంధమ్మున గట్టు వడియె *బాలుని వోలెన్"

ఆ మీద...

"ఆ లలన గట్టె ఱోలన్
లీలన్ నవనీత చౌర్యలీలుర్ బ్రియవా
గ్జాలుం బరి విస్మిత గో
పాలుర్ ముక్తాలలామ ఫాలుర్ బాలుర్"

"పట్టి యెల్ల బోటి పట్టి యాతం డని
గట్టి తలపుతోడ గట్టె గాక
పట్టి కడుపు వెక్కు బ్రహ్మాండములు వట్టు
ఱిగి నేని తల్లియేల కట్టు"

"చిక్కడు సిరి కౌగిటిలో
జిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములం
జిక్కడు శ్రుతి లతి కావలి
జిక్కె నతడు లీల దల్లి చేతన్ రోలన్"

ఆ విధంగా కట్టుబడిన కృష్ణయ్యను సావిట్లో వదిలి, యింటి పనులు చూసుకోవటానికని యశోద లోపలకు వెళ్లింది.

...ఇక్కడ ఒక చిన్న కథ చెప్పాలి.

కుబేరుడు సంపద లన్నింటికీ రాజు. ఆ సంపదలు చూసుకుని అతని కొడుకులు నలకూబర మణిగ్రీవులు అతి గర్వంతో సంచరించే వాళ్లు. వాళ్లు పెద్దల మాటలు వినేవాళ్లు కాదు; పేదల వంక చూసే వాళ్లే కాదు.

అది నారద మహర్షికి చాలా కష్టంగా ఉండేది. వాళ్ల కెలాగయినా బుద్ధి చెప్పాలని ఆయన నిర్ణయించుకున్నాడు. అందుకని,

"సంపన్నుం డొరు గానలేడు తనువున్
సంసారమున్ నమ్మి హిం
సింపంజూచు దరిద్రు డెత్తువడి శు
ష్కీభూతుడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకుం సములుగా
జింతించు నట్లౌట స
త్సంప న్నాంధున కంజనంబు వినుమీ
దారిద్ర్య మూహింపగన్"

అని అనుకున్నాడు.

అలా అనుకుని, ఒక రోజున, ఒళ్లు తెలియకుండా తిరుగుతున్న నలకూబర మణిగ్రీవులను చూసి "మీరు భూలోకంలో మద్దిచెట్లుగా పుట్టండి" అని శపించాడు.

శపించాడే కాని, ఆ కుఱ్ఱ వాళ్లని చూస్తే ఆయనకే జాలి వేసింది. అందుకనే, వాళ్లు నూరేళ్లపాటు భూలోకంలో ఉంటే చాలుననీ, అక్కడ ఉండే అష్టకష్టాలూ అనుభవించటంతో వాళ్లకు బుద్ధి వస్తుందనీ అనుకున్నాడు. అలాగే వాళ్లకు చెప్పాడు కూడా...

"ముక్తులరై నారాయణ
భక్తులరై పరమసాధు భావశ్రీ సం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదు వాక్యముకతనన్"
అని కూడా అన్నాడు.

ఆ నలకూబర మణిగ్రీవులే నందగోకులంలో రెండు మద్ది చెట్లుగా పుట్టారు. అవీ నందుని యింటికి సమీపంలోనే ఉన్నై.

ఱోటికి కట్ట బడిన కృష్ణయ్య తల్లి కనుమొరగించి ఱోటిని దొర్లించుకుంటూ ఆ చెట్లవేపుగా వెళ్లాడు. అక్కడ...



# ★ 10. వరంగం ★

[ కృష్ణయ్య రెండు మద్దిచెట్ల మధ్యనుంచీ దూరి అవతల వేపుకు వెళ్లాలని ప్రయత్నంచేస్తున్నాడు; కాని, ఆ ఱోలు ఆ చెట్లకు అడ్డుపడటం వల్ల అది సాధ్యం కాలేదు. అందుకనే ఆతను తన బలమంతా ఉపయోగించి ఆ ఱోటిని ముందుకు లాగాడు. ఆ తాకిడికి ఆచెట్లు రెండూ పెళపెళ మని విరిగి పోయినై.

ఆ చెట్లు అలా విరిగి కూలుతూ ఉంటే ఒక పెద్ద మ్రోత అయింది. అంతలోనే కోటి మెరుపులు మెరిసినంత వెలుగు వచ్చింది.

చెట్లు కూలిపోగానే వాటిలోనుంచి యిద్దరు చక్కని యువకులు బయట పడ్డారు. మరుక్షణంలో వారిముందు శ్రీహరి ప్రత్యక్షమైనాడు. ]

**యువకుడు:** 1. " బాలుడవె నీవు పరుడవ
నాలంబుడ వధికయోగి వాద్యుడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలా రూపమండ్రు నిపుణులు కృష్ణా!"

2. ( భక్తితో నమస్కరిస్తూ )

" భువనములునేయ గావగ
నవతీర్ణుడవైతి గాదె యఖిలేశ్వర యో
గి వరేణ్య విశ్వమంగళ
కవి సన్నుత వాసుదేవ కళ్యాణ నిధీ "

1. " తపస్వి వాక్యంబులు దప్పవయ్యెక్
నేపంబునం గంటిమి నిన్ను జూడం
దపంబు లొప్పెక్ మము దావ కీయ
ప్రపన్నులం జేయుము భక్తమిత్రా!"

ఇద్దరూ: పరమేశ్వరా!

"నీ పద్యావళు లాలకించు చెవులున్
నిన్నాడు వాక్యంబులున్
నీ పేరం బనిసేయు హస్తయుగముల్
నీ మూర్తిపై జూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్
నీ సేవపై చిత్తముల్
నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్
నీ రేజ పత్రేక్షణా!"

[ అలా అంటూనే వాళ్లిద్దరూ ఆయనముందు సాష్టాంగ పడ్డారు. దూరంగా ఒక చెట్టువెనుక నుంచుని అదంతా చూస్తున్న ఒక గోపకుడు కూడా అక్కడినుంచే ఆయనకు అంజలించాడు.

అంతలో, కృష్ణా . కృష్ణా!" అని కేకలు పెట్టుకుంటూ గోకులం లోని ఆబాల గోపాలం మద్దిచెట్లవేపుగా పరుగెత్తుకు వస్తున్న అలజడి అయింది. ]



## ★ 11. వ ర ం గ ం ★

[ అక్కడ రెండు మద్దిచెట్లు కూలిపోయి ఉన్నై. వాటి ముందు
కృష్ణయ్య నుంచుని ఉన్నాడు.
యశోద గబగబా ముందుకువచ్చి కృష్ణయ్యను యెత్తుకుంది;
రోహిణి ఆతనికట్లు విప్పేసింది. ]

**యశోద:** కృష్ణయ్యా...! కృష్ణయ్యా...!! ఏమిటి నాయనా; యిదంతా?

[ కృష్ణయ్య అమాయకంగా మందహాసం చేశాడు. ]

**రోహిణి:** ఉహుఁ...! దినదిన గండంగా ఉందమ్మా; యీ యనతో!

**ఒక గోపకుడు:**

" ఈ పాదపములు గూలగ
నీ పాప డులూఖలమున నిటు బద్ధుండై
యే పగిది బ్రదికె గంటిరె
వా పోవడు వెఱవ డెట్టి వాడో యితడుగ్ "

**ఒక గోపిక:** ఈయన చేష్టలు యెవరికీ యేమీ అర్థం కాకుండా ఉన్నై.

" పిడుగు వడుట కాదు పెనుగాలి విసరదు
ఖండితంబు లగుట గానరాదు
బాలు డితడు వట్టి పడద్రోవజాలడు
దరువు లేల కూలె ధరణి మీద "

**ఒక గోపకుడు:**

ఉహుఁ! నేను కళ్లారా చూశానమ్మా! అబ్బాయి గారు యీ చెట్లమధ్య దూరి ఱోటిని ముందుకు లాగారు. అంతే. చెట్లు రెండూ అమాంతంగా కూలిపోయినై.

అంతలోనే యెవరో యిద్దరు దేవతలు వాటి
ల్లోంచి బయటి కొచ్చారు. ఆ వెంటనే మన బాబు
అదో మాదిరిగా మారిపోయినాడు. నాలుగు
చేతులూ ఆయనా చూడటాని కెంతో ముచ్చటగా
తయారైనాడు.

అదంతా ఒక్క నిమిషంలో జరిగిందమ్మా! కన్ను
మూసి కన్ను తెరిచే టప్పటికి తిరిగి అదంతా
మాయమై పోయింది.

[ ఆ మాటలు విన్న నందుడూ యశోదా రోహిణీ మాత్రం తన్మ
యత్వం పొందారు. ఇతరులు 'ఇదేతో ఆశ్చర్యంగా ఉందే'
అన్నట్టు ఒకరి వంక ఒకరు చూసుకున్నారు.

ఉపనందుడు యేదో సందేహంతో తల పంకించాడు. నందుని
సమీపించాడు. ]

**ఉపనందుడు:** విన్నావా అన్నా...!

[ 'ఏమిటి?' అన్నట్టుగా నందుడు అతనివంక చూశాడు. ]

...ఎవ రేమన్నాసరే; యిక మనం యీ ఊళ్లో

ఒక క్షణంకూడా ఉండటానికి వీల్లేదు!

**నందుడు:** అదేమిటి...? ఈ ఊరేంచేసింది ?

**ఉపనందుడు:** చేసింది చాలదూ? ఇంతకంటె యేంచేయాలి?
ఉహూఁ!

"ఇక్కడ నుందురే మనుజు
లీ మన కృష్ణున కెగ్గుసేయగా
రక్కసురాలు చన్నొసగె;
రాల పయిఁ౯ సుడిగాలి వైచె, బై

గ్రిక్కిఱియం దరుల్ వడిరెు
గేశవు సత్కృప దప్పె జాలు నే
డెక్కడ కైన బోవలయు
నింకిట *దాళుట నేమమౌనొకో "

**నందుడు:** నీ అభిప్రాయాన్ని కాదనటం కాదు ; కాని, యిప్పుడు యెక్కడి కని వెడతాం ?

**ఉపనందుడు:** ఎక్కడి కేమిటి ?

" కసవు గల దిరవు పసులకు
లస దద్రి నదీ మహీజలతికావలి పెం
పెసగును గాపురమునకును
బొసగును బృందావనంబు వోద డచ్చటికిన్ "

**ఒక గోపకుడు:** నిజం ! అక్కడికి వెడితే యే బాధా ఉండదు !

[ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూ నందుడు తల ఊపాడు; మౌనంగా ముందడుగు వేశాడు.

ఉపనందుడూ మిగిలినవాళ్లూ ఆయన వెనుక వెళ్లారు. ]



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. బలరాముడు
3. అఘుడు
4. నారదుడు
5. బ్రహ్మ
6. సరస్వతి

# విచిత్రవధలు

## ★ 1. వరంగం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... నలకూబర మణిగ్రీవులకు శాప విముక్తి కలిగిన తరువాత, కృష్ణయ్యను తీసుకుని నందాది గోపకులు బృందావనం చేరుకున్నారు; దాని నివాస యోగ్యంగా తయారు చేసుకున్నారు.

అక్కడ బలరామ కృష్ణులు తమ తోటిపిల్లలతో కలసి ...

" వేణువు లూదుచు వివిధ రూపములతో
గంతులు వైతురు కౌతుకమున
గురు కంబళాదుల గోవృషంబుల బన్ని
పర వృషభము లని ప్రతిఘటింతు
రల్లులు దట్టించి యంఘ్రుల గజ్జెలు
మొరయ దన్నుదు రోలి ముమ్మరముగ
బన్నిదంబులు వైచి ఫలమంజరులు గూల్చి
వ్రేటులాడుదురు ప్రావీణ్య మొప్ప
వన్యజంతు చయంబుల వాని వాని
పదురు వదరుచు వంచించి పట్టబోదు
రంబుజాకరముల జల్లులాడ జనుదు
రా కుమారులు బాల్యవిహారు లగుచు "

అంతేకాదు ......

"పోరుదురు గికురు వొడచుచు
దూరుదురు భయంబులేక తోరపుటిరవుల్
జారుదురు ఘన శిలాతటి
మీఱుదు రెన్నంగరాని మెలకువ నెలమిన్"

అలా ఆనందంతో కాలం గడుపుతూ, ఆ చిన్నారి తండ్రులు ఒకరోజున ఆవులనూ దూడలనూ తీసుకుని యమునా తీరానికి వెళ్లారు. అక్కడ......



## ★ 2. వ ర ం గ ం ★

[ కృష్ణయ్య వేణువు నూదుతూ ఒక చెట్టు క్రింద కూర్చు న్నాడు. బలరాముడు ఆనందంతో అది వింటున్నాడు.
ఆ సమయానికి ఒక చక్కని దూడ అక్కడకు వచ్చింది. అందరూ దాన్ని ఆశ్చర్యంతో చూశారు. కృష్ణయ్యకు మాత్రం యేదో అనుమానం కలిగినట్టుంది; అందుకనే అతను వేణువు నూదటం ఆపాడు ; అదో విధంగా తల ఆడించాడు. ]

**బలరాముడు:**... అబ్బ... ! ఎంత బాగుందో చూశావ్ ?

**కృష్ణయ్య:** ఉఁహుఁ ! మామూలు దూడ అయితేగా మామూలుగా ఉండటానికి !

**బలరాముడు:** ( సంభ్రమంతో )
... కామధేనువు కన్నట్టుంది !

**కృష్ణయ్య:** ( చిలిపిగా నవ్వి )
...దీన్ని కన్నది కామధేనువు కాదు; కంసుడు మామయ్య !

[ అది విన్న బలరాముడు పకపకా నవ్వాడు. అంతలో ఆ దూడ యేదో భయపడ్డట్టుగా కృష్ణయ్య వంక చూసి, అక్కడి నుంచి కదిలి వెళ్ళబోయింది. ]

...అదుగో చూశావా...? పసిపట్టామని తెలుసు కుని పారిపోవాలని ప్రయత్నిస్తోంది.

[ కృష్ణయ్య ఆ మాట అంటూ ఉండగానే ఆ దూడ చెంగుచెంగున యెగురుతూ వెళ్ళసాగింది. కృష్ణయ్య యేదో ఆలోచిస్తూ దాని వెనుక పరిగెత్తాడు.
బలరాముడు కూడా కృష్ణయ్యతోపాటు లేచాడు ; కాని, అక్కడే నుంచుని అటు చూడ సాగాడు. ]

**బలరాముడు:** ...అయ్యయ్యో...తంతుంది...! ఒదిలై, ఒదిలై!

[ దూడ అరవటం మొదలు పెట్టింది.

కృష్ణయ్య, "ఉఁహూఁ! ఆగు...ఆగు...!! ఊఁ!" అనటం వినిపిస్తోంది. ]

...ఊఁ...! వెళ్లు...! వెళ్లు...! ప్రక్కగా వెళ్లు...!! ఆఁ...అలా...! అలా తిరగాలి...! తిరుగు! ఇప్పుడు పట్టు...! ఊఁ...! అంతే అంతే...! ఆ తోకతోనే కట్టు! రెండు కాళ్లూ కట్టు...! ఊఁ...! కట్టు...! బిగించు! ఛేష్... ఛేష్...! ఇహ లాగు...! లాగి...పడై...!! ఊఁ...! ... అదీ లెఖ్ఖ!!

[ అత డా మాట అంటూ ఉండగానే "మహారాజా! కంస మహారాజా!" అన్న అరుపు వినిపించింది. ఆ వెంటనే కొండ కూలినంత చప్పు డయింది. బలరాముడు పరవశంతో చప్పట్లు చరిచాడు.

అంతలోనే కృష్ణయ్య అక్కడకు వచ్చాడు అతని బట్టలు నెత్తురుతో తడిసి ఉన్నై. బలరాముడు అతణ్ణి అమాంతంగా కౌగిలించు కున్నాడు. మరుక్షణంలో వాళ్లమీద పుష్పవర్షం కురిసింది.

అప్పటికే గోపబాలు రందరూ అక్కడికి చేరుకున్నారు. వాళ్లు కృష్ణయ్య వంక ఆశ్చర్యంతో చూశారు. ఆ వెంటనే, దూరంగా పడి ఉన్న రాక్షసుడు వాళ్లకు కనబడ్డాడు; వాళ్లు నివ్వెర బోయినారు. ]

బాలుడు: 1. ... అరెరె... రాక్షసుడు!

2. రాక్షసుడు కాబట్టే అలా చచ్చాడు!

3. ఉఁహుఁ...దుర్మార్గుడు! దూడల్లే వచ్చివాలాడు; గోడల్లే కూలి చచ్చాడు.

[ అది విన్న పిల్లలందరూ పగలబడి నవ్వారు. ఆ తరువాత బలరామ కృష్ణులు, తమ స్నేహితులతో సహా ఆ రాక్షసు డున్న వేపుగా వెళ్లారు. ]



## ★ 3. వ ర ం గ ం ★

[ ఒక కథకుడు ఆ తరువాత జరిగిన కథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...ఆ విధంగా వత్సాసురుడు వధింపబడ్డాడు.

" వత్సముల పగిది జగముల
వత్సలతన్ మనుపజూచు వాడై యుంటన్
వత్సముల మేపు చుండియు
వత్సాసుర జంపె భక్త వత్సలు * డటులన్ "

ఆ తరువాత గోపబాలు రందరూ కలసి ఆ దగ్గరలోనే ఉన్న ఒక మంచినీటి కొలనువేపుకు వెళ్లారు. అక్కడ, వారి కొక భయంకరమైన కొంగ కనిపించింది. దాని ఒడ్డూ పొడుగూ చూసి బాలకులు భయపడి పోయినారు. ఆ కొంగ...

" ఎల్లపనులు మాని యేకాగ్ర చిత్తుడై
మౌని వృత్తి నితర మమత విడిచి
వనములోన నిలిచి వన జాక్షుపై దృష్టి
జేర్చి బకుడు దపసి చెలువు దాల్చె "

ఆ వింతజంతువును పరీక్షగా చూడటానికి గోప బాలు రందరూ, కృష్ణ బలరాములతో సహా, దాని దగ్గరకు వెళ్లారు.

అది గ్రహించిన బకుడు ఒక్కసారిగా...

" చంచువు దీటి పక్షములు
జల్లున విచ్చి పదంబులెత్తి కు
ప్పించి నభంబుపై కెగసి
భీషణ ఘోషణ వక్త్రుడై విజృం

భించి గరుత్సమీరమున
    భిన్నములై తరు లోలి గూలగా
మించి బకాసురుం డోడిసి
    మ్రింగె సహిష్ణుని జిన్నికృష్ణునిన్ ”

“ దనుజుడు మ్రింగిన గృష్ణుని
గనలేక బలాది బాలక ప్రముఖు లచే
తనులై వెఱగందిరి చ
య్యన బ్రాణములేని యింద్రియంబుల భంగిన్ ”

ఆ బకుడు కృష్ణయ్యను నోట్లోకి తీసుకున్నాడే కాని మ్రింగలేకపోయినాడు. అతనికి గొంతులో నిప్పు పెట్టుకున్నట్టయింది. అందుకని అతను వెంటనే కృష్ణయ్యను బయటకు కక్కేసాడు.



## ★ 4. వ రంగం ★

[ ఒక కొలను దగ్గిర గోపబాలురూ బలరాముడూ గుమికూడి ఉన్నారు. వారి మధ్య ఉన్న కృష్ణయ్య బకుని ముక్కును గట్టిగా పట్టుకుని అటూ యిటూ ఊపుతున్నాడు.

కృష్ణయ్య చేతులలోంచి తప్పించుకుని బయటపడాలని బకుడు తీవ్రంగా పెనుగులాడు తున్నాడు; మధ్య మధ్య ఉరుము తున్నాడు కూడా.

అంతలో కృష్ణయ్య, బకుని ముక్కును రెండు పచ్ఛాలుగా చీల్చేశాడు. దాంతో, ఆ రాక్షసుడు చావు కేక పెట్టి ప్రాణం వదిలాడు.

అది చూసిన గోపబాలకు లందరూ సంతోషంతో చప్పట్లు చరిచారు. 'చిన్ని కృష్ణయ్యకూ జై' 'గొల్ల కృష్ణయ్యకూ జై' అన్న నినాదాలు చేసారు. ]



## ★ 5. వరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...బకాసురుని వధ పూర్తి కాగానే, కృష్ణయ్యా అతని స్నేహితులూ, అక్కడే అనేక మైన ఆట లాడుకున్నారు.

“ కపులమై జలరాశి గట్టుదమా యని
కట్టుదు రడ్డంబు గాలువలకు
మునులమై తపములు మొనయుదమా యని
మౌనులై యుందురు మాటలేక
గంధర్వ వరులమై గాన విద్యలు మీఱ
బాడుదమా యని పాడజొత్తు
రప్సరో జనులమై యాడుదమా యని
యాడు రూపుల దాల్చి యాడజనుదు

రమర దైత్యవరులమై యబ్ధి ద్రచ్చుదమా
యని సరోవరముల యందు హస్త
దండ చయము ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుచరింప గొమరు మిగిలి. ”

అక్కడ అలా ఉండగా, మధురా నగరంలో......



## ★ 6. వ రం గం ★

[ అఘు డనే రాక్షసుడు ఒక గుట్టమీద కూర్చుని ఉన్నాడు. అతని ముందు అతని భటు డొకడు చేతులు కట్టుకుని నుంచు న్నాడు. ]

అఘుడు: ఉఁహూఁ!... అలా అన్యాయంగా చంపారన్న మాట!

భటుడు: చంపింది ఆ నల్లనయ్యే ఒక్కడే బాబూ...!

[ అఘుడు నిట్టూర్చాడు; తల పంకించాడు. ]

... మీ అన్న గారు నేలమీద పడి తన్ను కుంటూ ఉంటే, ఆ మిగిలినవాళ్లు "కృష్ణయ్యకూ ...జై" నల్లనయ్యకూ...జై! అని సంతోషంతో అరిచారు.

అఘుడు: ఉఁహూఁ! అరుస్తారు; అరవక యేంచేస్తారు? వాళ్ల ప్రాణాలకు ఆ నల్లనయ్య ఓ దేముడుగా ఉన్నాడు.

భటుడు: నిజం బాబూ... నిజం! వాళ్లు అలాగే అనుకుంటు న్నారు!

అఘుడు: బకాసురునితమ్ముడంటే బ్రహ్మకు కూడా హడలే. అది వాళ్లకు తెలియక తన్నుకుంటున్నారు.

భటుడు: ...మన మహారాజు కూడా అదే అన్నారు. అంతే కాదు; "ఆ నల్లనయ్యను హతమార్చిస్తే అర్ధ రాజ్య మిస్తాను" అనికూడా సెలవిచ్చారు.

అఘుడు: (సంతోషంతో)

సెబాస్! అన్నను చంపిన వాణ్ణి హత మార్చటం; అర్ధ రాజ్యానికి అధిపతి కావటం! ఊఁ...పద...!!

[ అలా అంటూనే అతను లేచి నుంచున్నాడు; భీకరంగా గర్జించాడు; భటుడు అందించిన కత్తిని తీసుకుని బయలుదేరాడు. ]



# ★ 7. వ రం గం ★

[ అడవిలో ఒక చోట కొందరు గోపబాలకులు దాగుడు మూత లాడుకుంటున్నారు.
కృష్ణయ్య ప్రోయించే వేణువు దూరంనుంచి వినబడుతోంది. ]

**గోప బాలుడు:**

...అల్లరి కృష్ణుడు వస్తున్నాడోయ్
గొల్లలు తలుపులు మూయండోయ్ !
'తుంటరి' కృష్ణుడు వస్తున్నాడోయ్
దొంగ రాక్షసులు దాక్కోండోయ్ !

[ అత నలా పాడి, పిల్లవాని కళ్లు తెరిచాడు.
అంతలో అక్కడ ఒక పెద్ద అలజడి అయింది. గొల్ల పిల్లలు పరుగు పరుగున అక్కడకు వచ్చారు ; వస్తూనే "పాము... పాము " అని భయంతో అరిచారు. ]

2. పా ము ...? ...ఎక్కడ ?
3. ఇక్కడే ... దారికి అడ్డంగా ఉంది !
1. అమ్మ బాబోయ్ ! ఐతే...యిప్పు డేంచేద్దాం ?
3. చేసే దేముంది ...? కృష్ణయ్యను పిలవటమే !
4. అంతే అంతే ! అతనైతే దాన్ని నిమిషంలో చంపేస్తాడు.
5. ఊఁ... ! దాన్ని చంపాలిసిందే నన్నమాట ?
4. చంపకపోతే యెలా ? మనం దాన్ని వదిలితే మాత్రం అది మన్ని వదులు తుందా ?
5. వదిలి పెట్టడానికి అదేమన్నా యిప్పుడు పట్టుకు కూర్చుందా ?

[ అతని అభిప్రాయం అర్థంకాక పిల్లలు ఒకరివంక ఒకరు చూసుకుంటున్నారు. ]

1. ఇంతకూ యిప్పు డేమంటావ్ ?

5. అనేందు కేముంది ? మనం అటు వెళ్లకుండా ఉంటే సరి; దాని దారిన అదే పోతుంది !

3. అలా పోదనుకో...! ...అప్పుడు ?

5. ఏముంది ? రాక్షసులకు పట్టినగతే దానికీ పడుతుంది !

4. అదీ నిజమే !

5. దీని వల్ల, మనకూ ధైర్య ముందని మనవాళ్లు మెచ్చుకుంటారు. ఔనా...కాదా ?

2. భేష్ భేష్ ! చాలా బాగుంది. అలాగే చేద్దాం !

1. ఊఁ...! ఎక్కడి పిల్ల లక్కడే...గప్‌చిప్...!

[ అత డలా అనగానే పిల్లలందరూ పరిగెత్తారు. మొదటి పిల్లవాడు తిరిగి పాటపాడాడు.

2. వ పిల్లవాడు స్నేహితులను వెతుక్కుంటూ బయలుదేరాడు; మరుక్షణంలోనే 'కృష్ణా ! కృష్ణా !' అని అరుస్తూ వెనక్కు వచ్చాడు. ]

1. ఏ మిత్రా ... యేమిటి ? ఏమయింది ?

2. పామురా...పాము ! 'పెద్ద' పాము !

1. పామే...? అది అక్కడుం దన్నారు గా !

2. అక్కడా ఉందేమో...నాకేం తెలుసు ?

ఇక్కడైతే ఉంది; మనవా ళ్లందరినీ మింగేస్తోంది.

1. అయ్యయ్యో...... !

2. ( భయంతో ఒణికిపోతూ )

కృష్ణా...! కృష్ణా...!! కృష్ణా...!!!

1. కృష్ణయ్యా......! ఓ ... కృష్ణయ్యా !!

[ వాళ్లు అలా పిలుస్తూ ఉండగానే కృష్ణ బలరాములు అక్కడికి వచ్చారు.

2. వ, కుఱ్ఱవాడు అమాంతంగా కృష్ణయ్యను కౌగిలించుకుని యేడవటం మొదలుపెట్టాడు. ]

కృష్ణయ్య: ఏమిటీ యేడుపు ? ఏమయింది ? మన వాళ్లేరి ?

గోపబాలుడు: 1. ఓ పాము వాళ్లని మ్రింగేసిందిట !

[ కృష్ణయ్య ఆశ్చర్యంతో ఆ కుఱ్ఱవానివంక చూశాడు. ]

బలరాముడు: ఆవులూ దూడలూ యెక్కడున్నై ?

గోపబాలుడు: 2. ఏమో...! అవీ కనబడటం లేదు !

కృష్ణయ్య: ( కొంచెంగా ఆలోచించి )

ఊఁ...! ఒక్కపాము యింతపని చేసిందా ?

[ అంటూనే కృష్ణయ్య యేదో ఆలోచన తట్టినట్టుగా తల ఆడించాడు. ]

గోపబాలుడు: 2. అది పామంటే పాము కాదు; 'పేద్ద' పాము. దాని నోరు ఒక నుయ్యి మాదిరిగా ఉంది ; నువ్వే చూస్తావుగా !

[ అతను ఆ మాట అంటూ ఉండగానే కృష్ణయ్య అటుగా పరిగెత్తాడు. బలరాముడూ, మిగిలిన కుఱ్ఱవాళ్లూ, అక్కడే నుంచుని అటు చూడ సాగారు. ]



## ★ 8. వ రం గం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ...అలా వెళ్లిన కృష్ణయ్య ఆ పామును చూశాడు. చూసి, తన స్నేహితు లందరినీ అదే మ్రింగి ఉంటుం దని నిర్ణయించుకున్నాడు ; అందుకనే...

" పడుచులు లేగలుం గలసి
పై కొని వత్తురు తొల్లి కృష్ణ మా
కొడుకు లదేల రారనుచు
గోపిక లెల్లను బల్కునే క్రియన్
నొడివెద నేడు పన్నగము
నోరికి వీరికి నొక్కలంకెగా
నొడబడ నేలజేసె విధి
యోడక సేయుగదయ్య క్రౌర్యముల్ "

అని విచారపడ్డాడు.

ఆ వెంటనే కృష్ణయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు. ఏమని ? ఎలాగైనా వా ళ్లందరినీ బ్రతికించాలీ అని ; అందుకనే ఆ పామును సమీపించాడు. సమీపించి, ఓ గుహ మాదిరి ఉన్న దాని నోటికి అడ్డుగా నుంచున్నాడు ; అమాంతంగా తన శరీరాన్ని పెంచు కున్నాడు.

నోటికి అడ్డుగా నుంచున్న కృష్ణయ్యను మ్రింగటా నికి గాని, కృష్ణయ్యకు దూరంగా పోవటానికి గాని

అప్పుడా పాముకు శక్తి లేకపోయింది. అందుకనే అది ఊపిరాడక గిలగిలా తన్నుకుంది. తన్నుకుని తన్నుకుని తల పగిలి చచ్చిపోయింది.

అంతే. తలపగలటమే తడవుగా ఆ పాము కడుపులో ఉన్న గోపబాలు రందరూ బయట పడ్డారు. ఆ వెనుక ఆవులూ దూడలూ కూడా వచ్చేసినై. అప్పుడు...



# ★ 9. వ రంగం ★

[ చచ్చిపోయిన పాము అక్కడ పడిఉంది. దానిప్రక్కనే కృష్ణయ్యా అతని స్నేహితులూ నుంచున్నారు. అక్కడే ఆవులూ దూడలూ కూడా ఉన్నై.

అంతలో ఒక పెద్ద వెలుగువచ్చి కృష్ణయ్యలో కలిసిపోయింది ; కృష్ణయ్య మందహాసం చేశాడు.

గోపబాలు రందరూ కృష్ణయ్యచుట్టూ తిరుగుతూ ఆనందంతో నాట్యం చేయసాగారు. అందరూ కలిసి...

హరే రామ, హరే రామ
రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ
కృష్ణ కృష్ణ హరే హరే !

అని పాడసాగారు.

అంతలో వారిమీద పూలవాన కురిసింది. పైనుంచి శంఖాలు మోగినై ; భేరీలు ధ్వనించినై. ]



## ★ 10. వ ర ం గ ం ★

[ వీణ వాయిస్తున్న సరస్వతీదేవి అమాంతంగా అది ఆపేసింది.
బ్రహ్మదేముడు కూడా పరధ్యానంలో పడ్డాడు.
అంతలో నారదుడు ప్రవేశించాడు. ]

నారాయణా నారాయణా నారాయణా శ్రీమ
న్నారాయణా నారాయణా నారాయణా భగవ
న్నారాయణా నారాయణా.........

**నారదుడు:** ( ప్రవేశిస్తూ )
పద్మజు లేదో పరధ్యానంలో ఉన్నారు...?

**బ్రహ్మ:** అఁహాఁహాఁ...యేమీ లేదు! ఏవో... వాద్యాలు వినిపిస్తుంటేను...!

**నారదుడు:** ...ఓ...అదా? అయితే సెలవు...!
( కదలి పోతూ )
నారాయణ...! నారాయణ...!!

**సరస్వతి:** ...అదేమిటి...? ఇప్పుడేగా వచ్చింది! కాస్సేపు కూర్చోరాదూ?

**నారదుడు:** ...వీల్లేదమ్మా...; వెంటనే వెళ్లాలి!

**బ్రహ్మ:** ఎక్కడికి?

**నారదుడు:** ఎక్కడి కేమిటి...? అక్కడికే... భూలోకానికి! మే మిప్పుడు ఉండేదే అక్కడ!

**సరస్వతి:** ఏమి టావిశేషం?

**నారదుడు:** ఇప్పుడు అక్కడ జరిగే దంతా విశేషమే! అటువంటి విశేషాలు యింతవరకు మేం చూడలేదు; మేమే కాదు, యెవ్వరూ కూడా చూసి ఉండరు!

బ్రహ్మ: అబ్బ! మహర్షులే అంతగా మెచ్చుకుంటున్నారూ అంటే, అదేదో మహత్తరమైన విశేషమే అయి ఉంటుంది!

నారదుడు: అయినా కాకపోయినా; అవి కళ్లారా చూడాల్సినవే కాని ఒకరుచెబితే విని సంతృప్తిపడేవిమాత్రం కావు.

[ ఆమాట అంటూనే నారదుడు తన్మయత్వం పొందాడు. ]

సరస్వతి: అవేమిటో మాకు కూడా చెబితే...

[ నారదుడు పరధ్యానంలో ఉన్నాడు. పరమాత్ముని తలచుకుని ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. ]

బ్రహ్మ: ...అమ్మ యేమిటో అంటోంది!

నారదుడు: ఆఁ! ఏమిటమ్మా?

సరస్వతి: అక్కడేవో విశేషాలు...

నారదుడు: ఆఁఆఁ...! చాలా జరుగుతున్నై. అక్కడ కృష్ణయ్య అనే ఒక నల్లనయ్య యీ మధ్యనే పుట్టాడు. ఆయన భూమిమీద పడ్డదిమొదలు చేసే ప్రతి పనీ విచిత్రంగానే ఉంటోంది. ఇప్పటి కిప్పుడు ఒక విచిత్రమైన లీల చూపించాడు.

సరస్వతి: ...ఏమిటది?

నారదుడు: ఓ పెద్దపాము అతని స్నేహితులనూ, కొన్ని ఆవులనూ దూడలనూ అమాంతంగా మ్రింగేసింది. అసలది పాముకాదు; అఘుడు అనే రాక్షసుడే అలా పాము రూపంలో అక్కడికి వెళ్లి ఆ పని చేశాడు. కృష్ణయ్య అది గ్రహించాడు. గ్రహించి, దాన్ని విచిత్రంగా చంపేశాడు. అంతేకాదు, అంతకుముందు అది చంపేసిన తనవాళ్లందరినీ, తిరిగి బ్రతికించుకున్నాడు; అదీ విశేషం!

బ్రహ్మ: ఆఁ...! నిజంగానా?

**నారదుడు:** అలా అనుమానిస్తారనే అసలు నేను చెప్పవద్దను కున్నాను.

**బ్రహ్మ:** అఁహాఁహాఁ...! అనుమానించటం కాదు; అంత పని జరిగిందా అని ఆశ్చర్యపడుతున్నాను; అంతే!

**నారదుడు:** ఆ నల్లనయ్య యేంచేసినా అలాగే అనిపిస్తుంది. అందుకనే మొదట్లో మనవిచేసుకున్నాను; 'ఆ లీలలు కళ్లారా చూడవలసినవే కాని; విని సంతృప్తి పడేవి కావు;' అని.

**బ్రహ్మ:** అయితే ఆయనలో అంత మాహాత్మ్యం ఉన్న దన్న మాట!

**నారదుడు:** 'ఔ' నంటే అభిమాన మనుకుంటారు. అయినా నాకెందుకొచ్చింది?

[ అంటూనే వాళ్లకు నమస్కరించాడు; అక్కడినుంచి కదిలి వెళ్లాడు. ]

"హరే కృష్ణ...హరే కృష్ణ
కృష్ణ కృష్ణ...హరే హరే!!"

[ అలా పాడుకుంటూ వెడుతున్న నారదుణ్ణి చూసి బ్రహ్మ లోలోపల వికటంగా నవ్వుకున్నాడు.

**సరస్వతి:** అసలు విషయం అర్థంచేసుకోకుండా అలా నవ్వుతా రేమిటి?

[ బ్రహ్మ యీమాటు బిగ్గరగా నవ్వాడు.ఆసనంమీదనుంచి దిగాడు. అక్కడినుంచి కదలి గబగబా ముందుకు వెళ్లసాగాడు. సరస్వతి ఆతనివైఖరి చూసి నివ్వెరపోయింది. ]

ఎక్కడికి... యీ ప్రయాణం?

**బ్రహ్మ:** అక్కడికే; ఆ నల్లనయ్యను చూడటానికి! అతని లీలలు దర్శించటానికి! అతని శక్తి సామర్థ్యాలు పరీక్షించటానికి!

[ అంటూనే వెఱ్ఱిగా నవ్వుతూ గబగబా ముందుకు వెళ్లిపోయి నాడు. ]



# ★ 11. వ ర ం గ ం ★

[ కృష్ణయ్యా బలరాముడూ ఒక చెట్టుక్రింద నుంచున్నారు. కృష్ణయ్య దూరానికి చూస్తున్నాడు; తన స్నేహితులను పిలుస్తున్నాడు. ]

" ఎండల్ మ్రగ్గితి రాకటం బడిలి రిం
కేలా విలంబింపగా
రండో బాలకులార చల్ది గుడువన్
రమ్యస్థలం బిక్కడీ
దండల్ లేగలు నీరు ద్రావి యిరవం
దం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించు చుండగ సమం
దప్రీతి భక్షింతమే "

[ ఆ పిలుపు విన్న గోపబాలకు లందరూ వారివారి చల్దిమూటలతో పరుగుపరుగున అతణ్ణి సమీపించారు. ]



## ★ 12. వరంగం ★

[ ఒక కొండక్రింద కొన్ని ఆవుదూడలు మేతమేస్తున్నై. కొండ మీద ఓప్రక్కగా బ్రహ్మ నుంచుని ఉన్నాడు; దూరానికి చూస్తున్నాడు.

బ్రహ్మ:

ఆహాహా! ఎంత అందంగా ఉన్నాడు...!

అబ్బ! ఆ ముఖం యెంత నవనవలాడుతూ ఉంది!

ఊఁహుఁ! ఆ చిన్నారి యేమిటి...అఘాసురుణ్ణి చంపట మేమిటి? అది ఊహించుకోవటానికి కూడా వీలు లేకుండా ఉందే...!

అయినా యే పుట్టలో యే పా ముందో యెవరికి తెలుసు?

...ఏదేమైనా అతని శక్తిని పరీక్షించటం మాత్రం యెందుకైనా మంచిది.

[ బ్రహ్మదేముడు అలా ఆలోచించి, తన మంత్రశక్తివల్ల వెంటనే అక్కడ ఒక బిలాన్ని సృష్టించాడు.

ఆ వెంటనే ఆవులూ దూడలూ అందులో ప్రవేశించినై.

బ్రహ్మ వికటాట్టహాసం చేస్తూ ఆ బిలాన్ని మూసేశాడు. ]



## ★ 13. వ రం గం ★

[ కృష్ణ బలరాములూ, వారి స్నేహితులూ చల్ది లారగిస్తున్నారు అంతలో బలరాముడు దూరానికి చూశాడు; చూసి... ]

**బలరాముడు:** ...దూడలు దూరంగా వెళ్లినట్టున్నై !

[ గోపబాలు రందరూ అటే చూశారు. ]

**గోపబాలురు:** అలాగేఉంది ; ఒక్కటీ కనబడటం లేదు !

**కృష్ణయ్య:** ( లేచి, రెం డడుగులు ముందుకువేసి, దూరానికి చూస్తూ )

" వినుడో బాలకులార క్రేపు లటవీ
వీధిన్ మహాదూరముం
జనియెం గోమల ఘాస ఖాదన రతో
త్సాహంబుతో నెందు బో
యెనో యే మయ్యెనో క్రూర జంతువులచే
నే యాపదం బొం దెనో
కని తెత్తుం గుడువుండు చల్ది గొఱతల్
గాకుండ మీ రందఱున్. "

[ అని అంటూనే గబగబా ముందుకు వెళ్లాడు. అతనితోపాటు బలరాముడు కూడా కదిలాడు. గోపబాలురు మాత్రం అటే చూస్తూ అక్కడ నుంచున్నారు. ]

**గోపబాలుడు:** ... ఇక్క డున్నట్టుగా రావాలి !

**కృష్ణయ్య:** ఓ ......! ఇప్పుడు రామూ ?

[అంటూనే బలరామునితో సహా కృష్ణయ్య వెళ్లిపోయినాడు. ]



## ★ 14. వరంగం ★

[ అడవిలో అదొక భాగం. అందులో బలరామకృష్ణులు దూడల అడుగుజాడలు చూసుకుంటూ పోతున్నారు. ]

**కృష్ణయ్య:** ...... ఇదుగో ......!

" ఇచ్చో బచ్చిక మేసిన
విచ్చో ద్రావినవి తోయ మేగిన విచ్చో
ఇచ్చోట మంద గొన్నవి
ఇచ్చో బాసినవి * జాడ యిదె గనుమన్నా "

[ కృష్ణుని అభిప్రాయాలను బలపరుస్తూ బలరాముడు తల ఊపాడు. అలాగే గుర్తులు చూసుకుంటూ వాళ్లు కొంచెం దూరం వెళ్లారు; అంతలో బలరాముడు ఆగాడు. ]

**బలరాముడు:** ... ఇదుగో! అడుగుజాడలు యిక్కడితో ఆగి పోయినై ; చూశావా ?

[ కృష్ణయ్య 'ఊఁ!' అంటూ తల ఆడించాడు. ]

... ఇహ అవి యెక్కడికి వెళ్లినట్టు ?

**కృష్ణయ్య:** ... అదే అర్థం కాకుండా ఉంది !

**బలరాముడు:** ... మళ్లీ, వచ్చిన దారినే వెళ్లినయ్యేమో...?

**కృష్ణయ్య:** ... అదీ కావచ్చు!

[ అంటూనే కృష్ణయ్య వెనక్కు తిరిగాడు. ]

**బలరాముడు:** ఊఁహూఁ! ఇదేదో విచిత్రంగానే ఉంది!

[ అంటూ కృష్ణయ్యను అనుసరించి వెళ్లాడు. ]



## ★ 15. వ రం గం ★

[ అది కృష్ణ బలరాములూ వారి స్నేహితులూ అంతకు ముందు చల్దులు తిన్న స్థలం. కృష్ణ బలరాములు అక్కడకు వచ్చారు. అక్కడ వారికి చల్దిమూటలు మాత్రమే కనిపించినై. ]

**బలరాముడు:** ... అరెరె ... వీ ళ్ళేరీ ?

[ కృష్ణయ్య యేదో దీర్ఘంగా ఆలోచిస్తూ తల పంకించాడు. ]

...... ఏమి టిదంతా ?

**కృష్ణయ్య:** మోసం ! అంతకంటె యే ముంది ?

**బలరాముడు:** అదే ; యెవరుచేసి ఉంటారూ అని ?

**కృష్ణయ్య:** ఇంకా యెవరు... ఆయనే ! ఆ బ్రహ్మదేముడే !

**బలరాముడు:** ( ఆలోచిస్తూ )

...బ్రహ్మదేముడా ? ఆయనెందుకు చేస్తాడు ? ఆయనకూ మనకూ విరోధం యేముంది ?

**కృష్ణయ్య:** ...ఇది విరోధంతో చేసిన పనికాదు; వెఱ్ఱిగర్వంతో చేసిన పని !

**బలరాముడు:** ...ఊఁ ! ఆ గర్వానికైనా హద్దూ పద్దూ అంటూ ఉండాలిగా !

**కృష్ణయ్య:** ( చిరునవ్వుతో )

అతని దగ్గిర లేనిదే అది ; యేం చేస్తాం ?

**బలరాముడు:** ( కొంచెం కోపంతో )

ఏం చేస్తా మని ఊరుకుంటే యేమవాతుంది ? అతని గర్వం అణిగే మార్గం చూడద్దూ ?

**కృష్ణయ్య:** ( మందహాసం చేస్తూ )

...తప్పకుండా చూడాలి! చూడకపోతే యెలా?

( కొంచెం ఆలోచించి )

ఆఁ ... అదీ పని! అలాచేస్తే అతని గర్వమూ అణగారుతుంది; మన గౌరవమూ దక్కుతుంది!

**బలరాముడు:** ఏమిటది...?

**కృష్ణయ్య:** ఏ ముంది......?

" గోపాల సుతులు లేరని
గోపకులకు జెప్పనేల గోపాలకులుఁ
గోపికలు నలర బాలుర
క్రేపుల రూపముల నే జరించెద*నింకఁ "

[ ఆ మాట విన్న బలరాముడు 'భేష్ భేష్' అంటూ కృష్ణయ్యను కౌగిలించుకున్నాడు. ]



# ★ 16. వ ర ం గ ం ★

[ కథకుడు ఆ తరువాత జరిగిన గాథ చెబుతున్నాడు. ]

కథకుడు: ... ... ఆ విధంగా నిర్ణయించుకున్న కృష్ణపరమాత్మ తానే గోవత్సల రూపంలోనూ గోప బాలుర రూపం లోనూ తయారైనాడు.

" రూపంబు లెల్ల నగు బహు
రూపకు డిటు బాలవత్స రూపంబులతో
నేపారు టేమి చోద్యము
రూపింపగ నతని కితర రూపము గలదే "

" మరలుపు మనియెడు కర్తయు
మరలించు కుమారకులును మరలెడి క్రేపుల్
పరికింప దానయై హరి
మరలం జనె లీలతోడ మందకు *నంతన్ "

ఆ విధంగా మందలో ప్రవేశించి, కృష్ణయ్య, యెవరి దూడలను వారి వారి దొడ్లలో వదిలాడు; యెవరి పిల్లలను వారి వారి యిళ్లముందు విడిచిపెట్టాడు.

అలా ప్రతి యింట్లోనూ, ప్రతిదొడ్లోనూ కూడా తన తేజాన్ని నిలబెట్టి, కృష్ణయ్య, తన యింటికి తాను వెళ్లాడు.

అప్పుడు...మందలో...

" ఏ తల్లుల కే బాలకు
లే తెఱగున దిరిగి ప్రీతి నెసగింతురు ము
న్నా తల్లుల కా బాలకు
లా తెఱగున బ్రీతిజేసి *రాపై నచట౯ "

ఆ సమయంలో...

" పాయని వేడ్కతో నునికి
పట్టులకుం జని గోవు లెల్ల నం
భా యని చీరి వాలు మ్మనుచు
బైకొని మూర్కొని పంచితిల్లి పె
ల్లై యతిరేకమై పొదుగు
లం బెడలేక స్రవించుచున్న పా
లా రొమడ నాకుచున్ సుముఖ
లై యొసగెన్ నిజ వత్స కోటికిఁ "

అంతే కాదు. ఆ రోజునుంచీ బృందావనంలో ఉన్న తల్లిదండ్రు లందరూ, కారణం తెలియకుండానే, తమతమ పిల్లలను చూసి కృష్ణయ్యను చూసినట్టుగా మురిసిపోవటం మొదలుపెట్టారు.

ఈ విధంగా నల్లనయ్య బాల వత్స రూపాలు ధరించి ఒక సంవత్సరంపాటు కాలం వెళ్లదీశాడు.



## ★ 17. వరంగం ★

[ ఒకచోట గోపబాలురు కొందరు, గోవత్సలను మేపుతున్నారు. బ్రహ్మ, దూరంనుంచి వారిని చూస్తున్నాడు. ]

బ్రహ్మ: అరెరె...ఇదంతా వింతగా ఉందే!

" మందంగల్గు సవత్స బాలకులు నా
 మాయా గుహా సుప్తులై
యెందుం బోవరు లేవ రిప్పుడును వే
 రే చేయ నా కన్యులొం
డెందుఁ లేరు విధాత నే బరులు వీ
 రెవ్వార లెట్లొరొకో
యేం దేతెంచిరొ కృష్ణుతో మెలగు వా
 రేడయ్యేడిఁ నేటికిన్ "

ఊఁహూఁ!

" బ్రహ్మ పంపునగాని పుట్టదు
 ప్రాణి సంతతి యెప్పుడుఁ
బ్రహ్మ నొక్కడగాని వేరొక
 బ్రహ్మలేడు సృజింపగా
బ్రహ్మనేను సృజింప నొండొక
 బాలవత్స కదంబమే
బ్రహ్మ మందు జనించె నొక్కట
 బ్రహ్మమానది చూడగాఁ "

[ అంతలో ఒక పెద్ద మెరుపు మెరసినట్టయింది. బ్రహ్మ ముఖం విప్పారింది. అతనికి అమితమైన ఆనంధం కలిగింది. ]

...ఆశ్చర్యం...ఆశ్చర్యం! ఏమిటీ విచిత్రం ? అక్కడ ఉన్న అందరూ ఆ పరాత్పరుని ప్రతిబింబాలుగా ఉన్నారే! ... ఆహాహా !

[ అలా అనుకుంటూ బ్రహ్మ తన్మయుడై నిలబడ్డాడు. అంతలో మరొక వెలుగు వచ్చింది. తిరిగి అతను ఆ గోపబాలుర వేపు చూశాడు. అప్పుడు అతనికి కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు. అలా ఆశ్చర్యపడుతూనే అతను భక్తితో తల వంచాడు; హృదయ పూర్వకంగా చేతులు జోడించాడు. ]



## ★ 18. వ ర ం గ ం ★

[ చిన్ని కృష్ణయ్య వేణువు నూదుతూ ఒక చెట్టు క్రింద కూర్చు న్నాడు. ఒక గోవత్సం అతని ప్రక్కన పడుకుని ఉంది.

బ్రహ్మ పరుగు పరుగున కృష్ణయ్యను సమీపించాడు; వెంటనే, సాష్టాంగపడ్డాడు. ]

బ్రహ్మ: పరమేశ్వరా !

" మోహములేక జగంబుల
మోహింపగ జేయ నేర్చి మొనసిన విష్ణున్
మోహింపించెద ననియెడు
మోహమున విధాత *నేనె మోహితుడైతిన్ "

[ అదివిన్న కృష్ణయ్య మందహాసం చేశాడు. ]

" మాయలు కల్గువారలను
మాయల బెట్టెడి ప్రోడ నిన్ను నా
మాయ గలంచి నీ మహిమ
మానము జూచెద నంచు నేరమిం
జేయగ బూనితిం గరుణ
సేయుము కావుము యోగిరాజ వా
గ్గేయ దవాగ్ని త జ్జనిత
కీలము గూల్చి వెలుంగ నేర్చునే? "

[ శ్రీకృష్ణుడు అతని వంక సానుభూతితో చూశాడు. ]

" ఎఱిగిన వారికి దోతువు
నెఱి బ్రకృతిం జేరి జగము నిర్మింపగ నా
తెఱగున రక్షింపగ నీ
తెఱగున బ్రహరింప రుద్రు తెఱగున నీశా! "

[ శ్రీకృష్ణుడు, అప్పుడే అక్కడకు వచ్చిన బలరాముని వంక చూసి, చిరునవ్వు నవ్వాడు. ]

" దేవా నీ చరణ ప్రసాద కణ ల
బ్ధిం గాక లేకున్న నొం
డే వెంటంజను నీ మహామహిమ నూ
హింపంగ నెవ్వారికిన్
నీ వారై చను వారిలో నొకడనై
నిన్గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమం దయిన నొం
డెం దైన నో యీశ్వరా ! "

[ అది విన్న కృష్ణయ్య బ్రహ్మను ఆప్యాయంగా లేవ నెత్తాడు. ]

దేవాధి దేవా!

" సర్వము నీవ యెఱుంగుదు
సర్వ విలోకనుడ వీవ జగదధిపతివిన్
సర్వాపరాధు నను నో
సర్వేశ యనుగ్రహింపు చనియెద నింకన్ "

[ కృష్ణయ్య అతని వంక సానుభూతితో చూశాడు; దగ్గరకు తీసుకున్నాడు.

[ అంతలో దూరం నుంచి అటుగా వస్తున్న దూడల అంభా రావాలు వినిపించినై. ఆ వెంటనే, పూర్వం మాయమైన గోప బాలకు లందరూ " కృష్ణా...కృష్ణా! " అని అరుస్తూ వస్తున్న ధ్వని కూడా అయింది.

ఆ ధ్వనులు వినవచ్చిన వేపుగా కృష్ణయ్య కదిలాడు. బ్రహ్మ అతణ్ణి అనుసరించాడు. ]



## ★ 19. వరంగం ★

[ కథకుడు ఆ తరువాత జరిగింది చెబుతున్నాడు. ]

**కథకుడు:** ...ఆ విధంగా, శ్రీమన్నారాయణుడైన చిన్ని కృష్ణయ్య, బ్రహ్మదేవుని సాగనంపాడు. అంతలో గోపబాలకు లందరూ అతణ్ణి చేరుకున్నారు. ఆ తరువాత బలరామ కృష్ణులూ గోపబాలురూ, ఆ దగ్గర లోనే ఉన్న ఒక తాటితోపుకు వెళ్లారు.

తోపులో ప్రవేశించిన గోపబాలురకు తాటికాయలు కోసుకుందా మనిపించింది. అందుకనే వారు ఆ చెట్ల మీద యెక్కబోయినారు. అంతలోనే అక్కడ, గాడిదరూపంలో ఉన్న ధేనుకు డనే రాక్షసుడు వాళ్లమీద తిరగబడ్డాడు.

అది చూసిన బలరాముడు, ఆ గాడిద యెడమకాలు పట్టుకుని, యెత్తి, గిరగిరా త్రిప్పి ఒక తాటిచెట్టుకు విసిరి కొట్టాడు. దాంతో, ఆ రాక్షసుడు భీకరంగా ఓండ్రపెడుతూ ప్రాణం వదిలాడు.

రాక్షసుని తాకిడికి కూలిపోయిన తాటిచెట్టు ఆ ప్రక్కనేఉన్న మరొకచెట్టుమీద పడ్డది. దాంతో ఆ చెట్టుకూడా కూలిపోయింది. అది మరొకచెట్టుమీద పడ్డది. అదీ పడిపోయింది. ఆ విధంగా ఒక చెట్టు మీద మరొకచెట్టు పడి ఆ తోటలోఉన్న చెట్లన్నీ యెక్కడి వక్కడ కూలిపోయినై.

చెట్లు అలా కూలిపోవడంతో, వాటికున్న పళ్లన్నీ నేలకు రాలినై. గోపబాలురు వాటిని యేరి, ఓపెద్ద కుప్పగా పోసి యెవరికి కావలసినవి వాళ్లు తిన్నారు.

అంతలో చీకటి పడ్డది. అదిగ్రహించిన బలరామ కృష్ణులూ వారి అనుచరులూ బృందావనం వేపుగా బయలు దేరారు.

...శ్రీ మద్రమారమణగోవిందో హరి !!



## ★ ముఖ్యపాత్రలు ★

1. కృష్ణయ్య
2. యశోద
3. రోహిణి
4. బలరాముడు
5. కాళియుడు
6. }
7. } కాళియుని భార్యలు
8. }

# కాళీయమర్దనం

## ★ 1. వరంగం ★

[ ఒక కథకుడు కాళీయమర్దనాన్ని గురించి చెబుతున్నాడు. ]

కథకుడు: ...పూర్వం, సౌభరి అనే ఒక మునీశ్వరు డుండే వాడు. ఆయన, కొంతకాలం, యమునానదిలో తపస్సు చేసుకున్నాడు. ఆయన తపస్సుచేసుకునే రోజుల్లో, ఒకసారి, గరుత్మంతుడు అక్కడికి వెళ్లి, ఆ నదిలో ఉన్న చేపలదొరను మ్రింగటం జరిగింది.

గరుత్మంతుడు చేపలదొరను మ్రింగగానే, ఆ నదిలో ఉన్న చేప లన్నీ చాలా దుఃఖించినై; దిక్కులు పిక్కటిల్లేటట్టు యేడ్చినై.

సౌభరిమహర్షి ఆ చేపల యేడుపు విన్నాడు. వినటమే కాదు; వాటిని చూసి జాలిపడ్డాడు కూడా.

చేపలమీద ఆయనకు కలిగిన జాలి, గరుత్మంతునిమీద కోపంగా పరిణమించింది. అందుకనే, ఆయన ఆ గరుడుని ఉద్దేశించి, 'ఇకముందు యీమడుగులో అడుగు పెట్టావా తలపగిలి చచ్చిపోతావు' అని శపించాడు. అది విన్న గరుత్మంతుడు, చాలా విచారపడ్డాడు; తన తప్పును తాను తెలుసుకున్నవాడు కాబట్టి తలవంచుకుని వెళ్లిపోయినాడు.

మహర్షి శపించిన విషయాన్ని, గరుత్మంతుడు యెవరికీ చెప్పలేదు. కాని,అదెలాగో కాళియుని చెవులోపడ్డది.

ఆ విషయం అతనికి తెలియటం వల్లనే, ఆ తరువాత, అతను తన ప్రాణాన్ని కాపాడుకోవటం కూడా జరిగింది.

గరుడుడు పాములకు విరోధి. పాము కనబడితే చాలు, అతను ప్రాణం తీసేసేవాడు. అదీ అతని పగ. అది గ్రహించుకున్న పాములు ఓసారి అతనితో సంధి చేసుకున్నై. ఏమని ? అతని ఆధిపత్యాన్ని అంగీకరిస్తామని ; అతనికి ప్రతినెలా కొంత కప్పం చెల్లించుకుంటామని.

గరుడుడు ఆ షరతులకు అంగీకరించాడు. ఆనాటినుంచీ, అతను, అనవసరంగా వాటిజోలికి పోవటం మానుకున్నాడు. పాములు కూడా, చాలావరకు, అన్నమాట నిలబెట్టుకున్నై. అతనితో ఒప్పుకున్న ప్రకారం అవి, ప్రతినెలా కప్పం కడుతూనే ఉన్నై.

పాములన్నింటితో పాటు, కాళియుడు కూడా గరుత్మంతుని ఆధిపత్యాన్ని, మొదట్లో అంగీకరించాడు ; అతనికి కప్పం కట్టడానికి ఒప్పుకున్నాడు. కాని, ఆ తరువాత, అతనిలో ఉన్న గర్వం, ఆ ఒప్పందాన్ని 'త్రోసి రాజ'నేటట్టు చేసింది. దాంతో, అతను గరుడునికి కప్పం కట్టడం మానేశాడు.

కాళియుడు గర్వపోతన్న విషయం, గరుత్మంతునికి మొదటినుంచీ తెలుసు. కాని, అతనెప్పుడూ ఆ విషయాన్ని లక్ష్యం చెయ్యలేదు. అదే, కాళియుని కళ్లు గర్వంతో కప్పుకుపోవటానికి కారణం అయింది. కాళియుడు, కప్పం కట్టకుండా కాలం వెళ్లదీయటం గరుడుడు గ్రహిస్తూనే ఉన్నాడు. కాని, అతని తప్పును

అతను దిద్దుకోలేక పోతాడా అని, చాలా కాలం ఓపికపట్టి ఊరుకున్నాడు.

ఓ సారి, యేదో పనిమీద, గరుడుడు రమణక ద్వీపానికి వెళ్లాడు. వెళ్లి, అక్కడే ఉంటున్న కాళీయునికి కబురు చేశాడు; ఓ సారి వచ్చి కలుసుకు పోవలసిందీ అని.

కాని, కాళీయుడు అది లక్ష్యం చెయ్యలేదు; గరుత్మంతుణ్ణి కలుసుకోవటానికి వెళ్లలేదు.

అది కూడా, గరుత్మంతునికి, అంతగా కోపం తెప్పించలేదు. ఆ తరువాత, అతను, అక్కడ పనిపూర్తి చేసుకుని తిరిగి వెళ్లబోతూ, కాళీయుని యింటికి స్వయంగా తనే వెళ్లాడు; వెళ్లి, అతణ్ణి బయటకు పిలిచాడు.

ఆ పిలుపు విన్న కాళీయుడు బయటకు వచ్చాడు. వచ్చాడే కాని, గరుత్మంతుని పట్ల యే విధమైన గౌరవాన్నీ, అతను చూపించలేదు.

అప్పటికీ గరుత్మంతుడు ఉద్రేక పడలేదు. ఉద్రేక పడకపోవటమే కాదు, కాళీయునిపట్ల స్నేహభావాన్నే చూపించాడు; మర్యాదగానే మాట్లాడాడు.

ఆ మాటల సందర్భంలోనే, గరుత్మంతుడు చెప్పాడు; యేమని...? ‘ఎంతటి వాళ్లకైనా, మాట తప్పటం మంచిది కాదు’ అని.

అది విన్న కాళీయుడు, వికటంగా నవ్వాడు. ఆ నవ్వు చూసిన గరుత్మంతుడు, కొంచెం తీవ్రంగానే, అతనికి

హెచ్చరిక చేశాడు; 'గడచి బ్రతికిన వాళ్లు లోకంలోనే లేరు' అని.

ఆ మాట విని, కాళియుడు కళ్లెఱ్ఱ చేసుకున్నాడు. అంతే కాదు, విషం కక్కుతూ, గరుడుని మీద తిరగబడ్డాడు; అతణ్ణి ఇష్టం వచ్చినట్లల్లా గాయపరిచాడు.

గరుడుడు అది సహించలేక పోయినాడు. అతనికి ఒళ్లు తెలియని కోపంవచ్చింది. ఆ కోపంలోనే, అతను, కాళీయుని సమీపించి, ఒక్క చరుపుచరిచాడు.

ఆ దెబ్బతో, కాళీయుని కళ్లు తిరిగి పోయినై. అతని గర్వమంతా అణగారి పోయింది. ఆపైన, అక్కడ ఉంటే లాభం లేదన్న అభిప్రాయం కూడా, అతనికి కలిగింది. కాని, యెక్కడికని వెడతాడు?

అప్పుడు, అతనికి, యమునానది గుర్తుకొచ్చింది. అందులో ప్రవేశిస్తే ఆపద తప్పుతుందని, అతను నిర్ణయించుకున్నాడు, అంతే. ఆ వెంటనే, మూటా ముల్లే కట్టుకుని, భార్యా పిల్లలతో సహా యమునానదికి తరలి వెళ్లాడు; అందులో ప్రవేశించాడు; 'బ్రతుకు జీవుడా' అనుకున్నాడు.

ఆ రోజునుంచీ, కాళీయుడు, అక్కడే కాపురం ఉండిపోయినాడు. గరుత్మంతుని భయం తీరిపోవటంతో అతని గర్వం అమితమై పోయింది.

అది అలా ఉండగా...ఓ రోజున...



## ★ 2. వ ర ం గ ం ★

[ కాళిందీనది ఒడ్డున ఉన్న కదంబ వృక్షం మీద కూర్చుని, కృష్ణయ్య, వేణువు నూదుతున్నాడు. అంతలో, అతనికి, 'కృష్ణా! కృష్ణా !" అన్న ఆర్తనాదం వినిపించింది. ఆ వెంటనే అతను అటుగా చూశాడు. ]

కృష్ణయ్య: ...అరెరె...! అదేం అన్యాయం? మంచినీళ్లకని వెళ్లడ మేమిటి ; మరణ వేదన పడట మేమిటి ?

[ చెట్టు మీదనే నుంచుని, నదిలోకి చూశాడు. ]

...ఓహో! అదా సంగతి! ఆ నీళ్లల్లో విషం ఉన్న దన్నమాట!...ఆ సర్పమే దానికి మూల మన్న మాట! ఊఁహుఁ! అది, యిలా, నిష్కారణంగా, యెందరిని చంపేస్తోందో! ఊఁ...! సరే...!

[ అలా అంటూనే, కృష్ణయ్య, వేణువును మొలలో పెట్టుకుని, ఆ నదిలోకి దూకాడు.

కృష్ణయ్య నదిలో దూకటం, కాళియుడు చూశాడు. చూసి, వికటాట్టహాసం చేశాడు; విషాన్ని వెళ్లగ్రక్కాడు.

మరుక్షణంలో, ఆ ప్రదేశమంతా నల్లని పొగ మాదిరి విషంతో నిండిపోయింది. ఆ నదిలో నుంచి, సముద్రాన్ని మథిస్తున్న శబ్దం పుట్టుకొచ్చింది.

అంతలో, గోపబాలు రందరూ, అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు ; ఆ చెట్టు దగ్గర నుంచుని, ఆ దృశ్యం చూశారు. ]

గోపబాలుడు:

1. ...కృష్ణా...! కృష్ణా...!!
2. అయ్యో అయ్యో...! అది, కృష్ణయ్యను చుట్టేసు కుంటోంది.
3. అతణ్ణి నలిపేస్తోంది కూడా!

అందరూ: ( ఆవేదనతో )

కృష్ణా...! కృష్ణా...!!

[ అంతలో, గోవు లన్నీ, అమితమైన బాధతో అంభారావం చేసినై. ఆ వెంటనే ఓ పెద్ద తుపాను గాలి వీచింది. "కృష్ణా ... కృష్ణా !" అన్న నినాదాలు ఆ ప్రదేశ మంతటా మారు మోగినై. ]



## ★ 3. వ ర ం గ ం ★

[ అది యమునా నది. అందులో, కాళియుండు కృష్ణయ్యను పెనేసుకునిఉన్నాడు; యిష్టం వచ్చినట్టల్లా కాటేస్తున్నాడు. కృష్ణయ్య, కాళియునితో చాలాసేపు పెనగులాడాడు; చివరకు, స్పృహతప్పిన వాడల్లే అతనిమీద ఒరిగి పోయినాడు.
అదే సమయంలో, బృందావనంలో ఉన్న జనం, అబాల గోపాలం, అక్కడికి పరిగెత్తుకుంటూ వచ్చారు. ఆ వచ్చిన వారిలో, బలరాముడు కూడా ఉన్నాడు. కాని, అతను, కృష్ణయ్య పడే బాధను గ్రహించనట్టుగా, వాళ్ళందరికీ దూరంగా నుంచున్నాడు. ]

**గోపాలుడు:**

1. ... అయ్యయ్యో...! కృష్ణా!!

"విషకుచయుగ యగు రక్కసి
విషకుచ దుగ్ధంబు ద్రావి విష విజయుడవై
విషరుహాలోచన యద్భుత
విషయుం డగు నీకు సర్ప విష మెక్కెగదే!"

**రోహిణి:** కృష్ణయ్యా!

"పన్నగము మమ్ము గఱవక
నిన్నేటికి గఱచె గుట్టు నెమ్మి గలిగి నీ
వున్నను మము రక్షింతువు
నిన్నుఁ రక్షింప నేము నేరము తండ్రీ!"

**యశోద:** నల్లనయ్యా...! నా తండ్రీ!

"కట్టా క్రూర భుజంగము
గట్టలుకన్ నిన్ను గఱవ గంపించితి వో
తిట్టితివో పాపపు విధి
బట్టి మముం దలచి కాక బలవించితివో!"

**రోహిణి:** ......నాయనా!

"చూడ వదేమి గారవపు
జూపుల మమ్ము సఖాలి తోడ మా
టాడ వదేమి నర్మముగ
నందెలు పాదము లందు మ్రోయ నే
డాడ వదేమి నర్తనము
ల వ్వల మ్రోలను గోపి కావలిం
గూడ వదేమి నవ్వులకు
గోపకుమార వరేణ్య చెప్పుమా!"

**గోపికలు:** కృష్ణా...! కృష్ణా!! నువ్వులేని మందలో మేమెలా ఉండేది? మాకు మరణాన్ని ప్రసాదించవూ...? మమ్మల్ని నీలో చేర్చుకోవూ...? కృష్ణా...! ...కృష్ణా...!!

[ అంటూ గోపిక లందరూ నదిలో దిగబోయినారు; గోపకులు కూడా వాళ్లను అనుసరించారు.
బలరాముడు అది చూశాడు. చూసి... ]

**బలరాముడు:**

ఆగం డాగండి! ఏమిటీ ఉద్రేకం? ఉపద్రవం వచ్చినప్పుడు ఓపికతో ఉండాలి గాని, ఉద్రేకపడితే యేమౌతుంది?

**ఒక వృద్ధుడు:**

అంతా చూస్తూకూడా అలాఅంటావేం నాయనా? ఇక మేం యెలా బ్రతకగలం? బ్రతికినా యేంచేయగలం?

**బలరాముడు:**

అందుకని ఆత్మహత్య చేసుకుంటారా?
( రోహిణితో )
అమ్మా...! ఏమి టిదంతా? నువ్వైనా కాస్త చెప్పకూడదూ? కాస్సేపు ఆగితే యేం పోతుంది? ఏం జరిగేదీ తేల్చుకుని యేం చేసినా చెయ్యచ్చుగా!

[ ఆ మాటలు వింటున్న గోపకులూ గోపికలూ కూడా, బల రాముని వంక చూడసాగారు. అంతలో, కృష్ణయ్య కళ్లు తెరిచాడు; తన ముందున్న తనవాళ్లందరినీ చూశాడు; నిద్రపోయి లేచిన వాడల్లే ఒక్కసారి ఒళ్లు విరుచుకున్నాడు. కృష్ణయ్య, ఒళ్లు విరుచుకోవటంతో, కాళియుని ప్రక్కటెముక లన్నీ పటపట లాడిపోయినై. అతను అమితమైన బాధ పడ్డాడు; గిల గిలా తన్నుకున్నాడు. ఆ శబ్దాన్ని విని, అక్కడి వాళ్లందరూ అటుగా చూశారు; ఆనందంతో 'కృష్ణా! కృష్ణా!!" అని అరిచారు.

[ కృష్ణయ్య, వాళ్లను చూసి, మందహాసం చేశాడు. ఆ వెంటనే కాళియుని వేపు తిరిగి, అతణ్ణి, చాచి చెంపకాయ కొట్టాడు. దెబ్బతిన్న కాళియుడు, నిలబడలేక పోయినాడు; నీటిలో మునిగిపోయినాడు. అదే అవకాశంగా తీసుకుని, కృష్ణయ్య, అతని పడగల మీద యెక్కి నుంచున్నాడు.

అది చూసిన గోపికలూ, గోపకులూ, సంతోషంతో చప్పట్లు చరిచారు; కృష్ణయ్యకు జేజేలు చెప్పారు.

అంతలో పుష్పవర్షం కురిసింది. దుందుభులు మ్రోగినై. శంఖారావ మయింది. ]

నందుడు: ...కృష్ణయ్యా...!!

" ఎట్టి తపంబు చేసెనొకో
యెట్టి సుకర్మము లాచరించెనో
ఎట్టి నిజంబు పల్కెనొకో
యీ ఫణి పూర్వభవంబునందు ము
న్నెట్టి మహానుభావులకు
నెన్నడు జేరువగాని నీవు నే
డిట్టి వినోద లీల దల
కెక్కి నటించెద వీ ఫణీంద్రుపై "

[ అది విన్న కృష్ణయ్య చిరునవ్వు నవ్వాడు. ]

**కాళీయుడు:** పరమ పురుషా...! పాహిమాం...పాహిమాం!!

" క్రూరాత్ముల దండింపగ
ధారుణిపై నవతరించి తనరెడి నీ కీ
క్రూరాత్ముని దండించుట
క్రూరత్వము గాదు సాధు గుణము గుణాఢ్యా!"

[ కాళీయుడు అలా పశ్చాత్తాపాన్ని ప్రకటించగానే, కృష్ణయ్య అతనిమీంచి దిగాడు. ఆ వెంటనే, కాళీయుని భార్యలు నది లోంచి పైకి వచ్చి కృష్ణయ్యకు నమస్కరించారు. ]

**భార్య:** 1. కమలా మనోహరా!

" బాలుం డీతడు మంచివా డనుచు జె
ప్పఁ రాము క్రూరుండు దు
శ్శీలుం డౌనవు నైన నేము సుభగ
శ్రీ బాసి వైధవ్య దు
ష్టాలంకారము బొంద నోడెద మనా
థాలాప మాలింపవే
చాలుఁ నీపద తాండవంబు పతి భి
క్షం బెట్టి రక్షింపవే!"

2. దివ్య మంగళ విగ్రహా!

" మమ్ము బెండ్లిసేయుమా ప్రాణ వల్లభు
ప్రాణ మిచ్చి కావు భక్త వరద!
నీవు సేయు బెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటి పెండ్లి పెండ్లిగాదు"

3. ఆర్త రక్షామణీ!

" నీ యాన యెవ్వారిని నిగ్రహింపం
డా యుగ్ర పాపా కృతి నంద డింకఁ
నీ యాజ్ఞలో నుండెదు నేటగోలెఁ
మా యాశు ప్రాణంబులు మాకు నీవే!"

[ ఆ ప్రార్థన విన్నకృష్ణయ్య కాళియుని భార్యల వంక సానుభూతితో చూశాడు. ]

కాళియుడు:...శరణాగత వత్సలా!

"మలకలు మా ప్రచారములు
మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము
గర్వుల మే మొక మంచి వారమే
నలిన దళాక్ష ప్రాణులకు
నైజ గుణంబులు మాన నేర్చునే
వెలయవె మా వికారములు
వింతలె మే లొనరించి తీశ్వరా!"

పుండరీకాక్షా!

"నా పుణ్య మేమి సెప్పుదు
నీ పాదరజంబు గంటి నే సనకాదుల్
నీ పాదరజము గోరుదు
రే పదమం దున్ననైన నిక మేలు హరీ!"

కృష్ణయ్య: కాళీయా! నీ పశ్చాత్తాపమే నీ కిప్పుడు ప్రాణదానం చేస్తోంది. ఇక నా మాటవిను.

"గో వర్గముతో మనుజులు
ద్రావుదు రీ మడుగు నీరు దగ దిందుండన్
నీవును నీ బాంధవులును
నీ వనితలు సుతులు జనుడు నే డంబుధికిన్"

కాళియుడు: పరమేశ్వరా! ఇలా శాసిస్తే యేమై పోవాలి!

కృష్ణయ్య: ( చిరునవ్వుతో )

...పిచ్చివాడా! ఎందుకు నీ కింతభయం!

"గరుడ భీతి రమణక ద్వీప మొల్ల కీ
మడుగు జొచ్చి తీవు మత్పదాబ్జ
లాంఛనములు నీ తలల నుంట జూచి యా
పక్షిరాజు నిన్ను బట్ట డింక !"

**కాళియుడు:** ధన్యోస్మి ! ధన్యోస్మి !!

**కృష్ణయ్య:** ...అంతే కాదు.

"నిను నే శాసించిన కథ
మనమున జింతించి రేపు మాపును గీర్తిం
చిన మనుజులు మీా భయమును
విను మెన్నడు బొంద రెందు విషవిజయముతోన్"

అదీ కాక......

"ఇది మొద లెవ్వారైన నరు
లీ యమునా తటినీ హ్రదంబులో
వదలక తోగి నన్ను నుప
వాసము తోడ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకు
గా జలదర్పణ మాచరించినన్
సదమల చిత్తులై దురిత
సంఘము బాయుదు రాక్షణంబునన్"

**అందరూ:** ( ఏక కంఠంతో )

... శ్రీ కృష్ణ పరమాత్మకూ జై !!

[ అదే సమయంలో గోవులన్నీ ఆనందంతో అంభారావం చేసినై. ]

